Nārāyaṇamūrti, Bhōgarāju

Kanyakāvijayamu

Bejavāḍa, 1925

Record no. 381

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

నారాయణమూర్తి, భోగరాజు.
కన్యకావిజయము / కృతికర్త భోగరాజు నారాయణమూర్తి.- బెజవాడ : వాణీ ముద్రణాలయము, 1925.
(2), 67 p. ;22 cm.
Record no. 381

Nārāyaṇamūrti, Bhōgarāju.
Kanyakāvijayamu / kṛtikarta Bhōgarāju Nārāyaṇamūrti.- Bejavāḍa : Vāṇī Mudraṇālayamu, 1925.
(2), 67 p. ;22 cm.
Record no. 381

35 mm microfilm
Image placement: IA (IIA) IB IIB
Date filming began:

కవితా కల్పలతా ప్రచురములు.

ప్రథమ ప్రచురము

# కన్యకా విజయము.


కృతికర్త:

భోగరాజు- నారాయణమూర్తి.

విజయనగర మహారాజాస్థానకవి.

విజయనగరము.





వాణీ ముద్రణాలయమునందు

ముద్రింపఁబడినది.

బెజవాడ.

1925




వెల చందాదారులకు ఒక రూపాయి. పోస్టేజికాక ఇతరులకు రూ. 1-4-0

# కవితా కల్పలతా ప్రచురములు

## పుష్పాంజలి

'కవితాకల్పలత' యను పేరున విజయనగరమున నొకగ్రంథమాల నెలకొల్పితిమి. కన్యకావిజయమిందుఁ బ్రథమప్రచురము. ఆంధ్రదేశమున కత్యంతోపయోగకరములై పిల్లలు పెద్దలు స్త్రీపురుషులు పండితులు పామరులుగూడ నామోదింపఁగలయుత్తమగ్రంథముల ననఁగా చరిత్రలు, నవలలు, నాటకములు, ప్రహసనములు, ప్రబంధములు, మహాపురుషుల జీవితములు, మున్నగువానిని బ్రచురించుట యీమండలియొక్క ముఖ్యోద్దేశము పూర్వపు మనమతము, మనదేశము, మనసంఘము, మనరాజకీయపరిస్థితులును, నాయాగ్రంథములయందు నిరూపింపఁబడుచుండును. యశోవంతులైన కవిరాజులును, ధనవంతులైన మహారాజులును, మాయుద్యమమునకు సాధ్యమగునంతవరకుఁ దోడుపడఁ బ్రార్థించుచున్నాము.

చిత్తగించవలెను.

విజయనగరము,
10—౫—26.

పసుమర్తి వీరభద్రస్వామి, బి. ఏ.
సంపాదకుఁడు.

# ఉపోద్ఘాతము

---

ఐదారు సంవత్సరముల క్రిందట నేనీ ప్రబంధమును వ్రాసితిని. పరమేశ్వరియైన శ్రీ కన్యకాంబిక పవిత్రచరిత్రమే యిందలి యితివృత్తమగుటచేత, నన్నీ కావ్యరచనకుం బ్రోత్సహించిన మహనీయులు మావిజయనగర వైశ్యసోదరులే యని వ్రాయునక్కరలేదు. వైశ్యకులోత్తంసము లెల్లరుఁ బరమేశ్వరి యాలయమున సభచేసి నాచేనీ గ్రంథమును జదివించి నన్నెంతయు సత్కరించిరి. ఆనాడు పవిత్రచరిత్రులును వదాన్యశేఖరులును నగు మ॥ రా॥ శ్రీ నారాయణము విశ్వనాథము గారి వేంకటరమణశ్రేష్ఠిగారును, పసుమర్తి గురుమూర్తిశ్రేష్ఠిగారును నా గ్రంథముద్రణవ్యయమును వారు భరించునట్లు సెలవిచ్చిరి. అట్లు శ్రీ వేంకటరమణశ్రేష్ఠిగారు 500 ప్రతులును, శ్రీ గురుమూర్తిశ్రేష్ఠిగారు 250 ప్రతులును నచ్చొత్తించి కన్యాకాపరమేశ్వరియందలి తమభక్తి ప్రకటించినందున నీమహనీయులిరువురును జిరాయురైశ్వర్యసంపన్నులై నిరంతరము సుఖింతురుగాక !

నాకు వలసినంత యవకాశము లేకపోవుటచేతఁ బ్రమాదజనితములైన దోషములను గొంతవరకుమాత్రమే నేను సవరించుకొనఁగలిగితిని. తక్కినవి ముందు ముందు సవరించుకొనెదను. 'ఏమివ్వఁగలఁడు' 'ఇటువంటి' 'ఖరారు' మొదలగు కొన్ని గ్రామ్యపదములను నేను బుద్ధిపూర్వకముగనే యుపయోగించితినని పండితులకు విన్నవించుకొనుచున్నాను.

ఇట్లు,
కృతికర్త,
భోగరాజు నారాయణమూర్తి.

విజయనగరం
2—3—25



శ్రీ

కన్యకాపరమేశ్వర్యై నమః

# కన్యకావిజయము.

## ప్రథమాశ్వాసము.

కం॥ శ్రీ రాజన్నగరాజకు
మారీసుకుమారు నెంతు మానసమున నా
హేరంబు సర్వశుభకా
ర్యారంభుఁ గావ్యవిరచనారంభమునన్॥

శా॥ గంగాతోయము నారికేళజలమున్ గాంక్షింపఁ దత్కాశికా
గంగాపూతము మాధురీవిజితరంగ న్నారికేళాంబువై
రంగారున్ సరసాస్మదీయ కవితారాజత్సుధాధార, నే
లింగస్వామి మహాభిషేకము శుభాలిం గోరి కావించెదన్॥

శా॥ కొండంబుట్టినఁ గొండ మెట్టిన నెదం గోరంత కాఠిన్య మెం
దుండన్ రాదని వెన్నకన్న మృదువౌ నుల్లమ్ముతో నిత్యమున్
గొండంచున్ సకలాశ్రితప్రతతి కోర్కుల్ దీర్చు బంగారుపుం
గొండన్ మాయిలవేల్పుటమ్మను సదా గొల్తున్ శుభప్రాప్తికిన్॥

ఉ॥ మందలనుండి పాలుగొని మందగతిన్ జను గోపకాంత, లం
దందును నాడుచున్న తనునారసి ముద్దిడఁ గోరి పిల్చినన్
ముందున కేగి ముద్దుకొకముం తెడు పాలని బేరమాడు నా
నందకుమార రత్నమును నామదిఁ గొల్తు నభీష్టసిద్ధికిన్॥

కం॥ సుందరకబరీ విజితేం
దిందిర, యిందిర ప్రఫుల్ల నీరజరాజ
న్మందిర, మన్మందిరసీ
మం దిరముగ నిలుచుఁగాక మహితాదరణన్॥

మ॥ కరముత్సాహముతోడ నూతనకథాకావ్యప్రపంచంబులన్
నిరతంబుల్ సృజియింత్రు సత్కవులు నానేర్పున్న వారన్న యా
దరణంబూని తదంగనావసయుగ ధ్యానాంతరంగున్ ననున్
సరసీజోద్భవుఁ డాయురున్నతుల నశ్రాంతంబు మన్నించుతన్॥

మ॥ కరముగ్రాగ్రహ విగ్రహుండనెద రేకాకెందు రాకేందు భా
సురకర్పూరపరాగశీతల కృపాస్తోకావలోకంబులన్
స్థిరశాంతాకృతి మాకుఁ గన్పరచు శ్రీ సింహాచలస్వామి, యా
నరసింహప్రభు వేలు మమ్ముఁ గరుణానందానుసంధానుఁడై॥

మ॥ పదునాల్గేడుల చిన్నప్రాయపుఁ గవిత్వప్రజ్ఞతోడన్ శుభా
స్పదునిన్ దన్నునుతింపఁ బాపెను మహార్ధవ్యాశ్వాసరోగవ్యథన్
దుదముట్టన్; భవరోగ సంహరణవైద్యున్, వేదవేద్యు, సుఖ
ప్రదు నమ్మంగళపాదు నర్సవిలిసూర్యస్వామి నర్చించెదన్॥

శా॥ ఆలంకారఝణంఝణక్వణము కర్ణానంద సంధానమై
గ్రాలన్ మత్సుకుమారచారు కవితాకన్యాలలామంబు నీ
మ్రోలన్ దాండవమాడఁ జేసెదను సంపూర్ణానురాగంబునన్
బాలింపంగదవమ్మ! నన్ను జననీ! వాణీ యశోదాయినీ!॥

గీ॥ దేవతాకోటికెల్ల మూర్తిత్రయంబు
కరణిఁ గవికోటికెల్ల మార్గప్రదర్శ
కంబగుచు శాశ్వతంబగు ఘనతగన్న
మన కవిత్రయమును సదావినుతి సేతు॥

క॥ అవ్యయకవితానిపుణుల
నవ్యయశోనిధులఁ బృథులనవరస విలస,
త్కావ్యప్రబంధకారుల
భవ్యాత్ములఁ బూర్వకవులఁ బ్రస్తుతి సేతుఁ॥



గీ॥ అక్షయాస్మత్కవిత్వ సారేక్షురసము
కర్ణపుటములఁ గ్రోలు యోగంబు లేక
యశమెసఁగునన్న యాశ నహర్నిశంబు
నలుసులను నేరు నలసులఁ దలఁపనేల॥

వ॥ అని యిట్లిష్టదేవతా ప్రార్థనాది శిష్టాచార ధర్మంబులు నిర్వర్తించి నూతన కావ్య నిర్మాణ కుతూహలచేతస్కుండనై తదుచిత కథాన్వేషణం బొనర్చుచుండ

సీ॥ పసుమర్తి సత్కులాభరణంబు వీరభద్రస్వామి నిర్మల ధర్మగామి,
నగరపాలకసంఘ సభ్యసభ్యత్వాది బహుగౌరవోద్యోగ భాసితుండు,
రాజిత శ్రీమహారాజ కలాశాలఁ బొలుపుగాంచిన యాంగ్లబోధకుండు,
ఆయ్యార్యవైశ్య వర్ణార్ణవ పూర్ణసుధాకరుండును సద్గుణాకరుండు,
మామకప్రాణహితుఁడు విశ్రామకాల
మునఁ గళాశాలలో నొక దినమునందు
నుచితసంభాషణము సేయుచుండునపుడు
వినుతకవితాభిమానియై యనియెనిట్లు॥

ఉ॥ ప్రస్తుతదేశభాషలను బట్టి రచించినయట్టి నీ కృతుల్
ప్రస్తుతిగాంచె దేశమునఁ బల్లెలఁ బట్టణసీమలన్ ముఖ
ప్రస్తుతిగాఁదలంపకుము పండితపామరసమ్మతంబు నీ
నిస్తులసత్కవిత్వ గణనీయవిధానము మిత్రరత్నమా!॥

శా॥ ఏ తత్పట్టణపండితుల్ వినఁగ నీ వేనాడు శ్రీ కన్యకా
పూతాఖ్యానము భాసురాశుకవితాపూరంబుగాఁ జెప్పి వి
ఖ్యాతింగాంచితో, నాటఁగోలెను దదీయాఖ్యానమెట్లయిన నీ
చేతన్ బూర్వకవీంద్రమార్గమున నేఁ జెప్పింపనూహించెదన్॥

ఉ॥ స్కాంధపురాణగాథలను గ్రాలెడు వైశ్య పురాణభాగసం
బంధపుఁ గన్యకా విజయపావనగాథ పురాతనంపుఁ బ్రా
బంధికయోగ్య మార్గమును బట్టి రచింపు; రచింతువేని త
ద్గ్రంథము శాశ్వతోన్నతిని గాంచి వెలుంగును వాఙ్మయంబునన్

ఉ॥ ప్రాంచదుదారశీలురు బరంపుర వైశ్య శిఖామణుల్ రచిం
పించిరి యక్షగానముగఁ బిన్నలుఁ బెద్దలు స్త్రీలుఁ దత్కృతిన్

గాంచి పఠింపలేరు తగు గానకళాగరిమంబు లేక: యి
ల్లించిన యోగ్యకావ్య మొకటేనియు లేదు కథాప్రసిద్ధికిన్ ॥

మ॥ పలుకుంజిల్కలకొల్కి నాల్కకొన నీభాగ్యంబునన్ నిల్చి నిన్
బలికింపంబలుకాడు పల్కు లమృతప్రాయంబులైదోప, నీ
వలనన్ వైశ్యులు తత్కథాఘనసుధావారాశి నోలాడఁగాఁ
గలరీపై; మృదుగద్యపద్యములఁ దత్కావ్యంబు గావింపుమా ॥

శా॥ దారావారును బేర్లవారు సుజనాధారుల్ రసజ్ఞుల్, గుణో
దారస్వాంతులు మోటమఱ్ఱి కులజుల్, ధర్మజ్ఞులున్ దీనమం
దారుల్ మా పసుమర్తివారు; సరసుల్ నారాయణంవార లు
న్నా రింకెందరొ తావకీనకృతి సన్మానించు వైశ్యాగ్రణుల్ ॥

చ॥ సరసులు పెంటపాటికులసాగరపూర్ణసుధాకరుల్, ద్విజా
దరణమనస్కులై తనరుధన్యులు వొబ్బిలిశెట్టివారు, నీ
కరయఁ బురాతనంపు హితులౌదు రెకా మనయాత్మకూరిధీ
వరు లిఁక నేమిలోపము భవత్కృతిగాంచును మేటిమన్ననన్ ॥

సీ॥ పట్టణంబున నార్యవైశ్యప్రముఖులందుఁ బేరుగన్నారు మాటూరివారు,
సత్కార్యములపట్ల సాహసౌదార్య విస్తారులేసుమి కట్టమూరివారు,
దేవభూదేవసేవావిశేషమ్ములఁ జెలఁగువారలు బొడ్డుకులమువారు,
సకలార్యఘనవైశ్య సంఘంబునం జాల కీర్తిగన్నారు గుగ్గిలమువారు

గీ॥ ఘనులు సూరంపలికులంపు వణిజులెల్ల
నయవిచారులు పెన్నమాన్వయులు గూడ
నింక నున్నారు ఘనులు పేరెక్కినట్టి
వైశ్యకులరత్నములు పురవరమునందు ॥

సీ॥ హరికనుంగు నెలంత సిరులొసంగెడు కాంత పోలుపార విహరించు పూలదోట.
విజయనగరరామ నిజలసద్గళసీమఁ దాల్చినసొగసు రత్నాలపేట
అఖిలాన్యదేశయాతాయాతవర్తక వ్రాతమ్మునకు మేటి రాచబాట
వెలలేని సకలనిస్తుల వస్తుసంతతుల్ రాజిల్లు జనుకల రాజుకోట ॥
కర్మము నిరుపేదజనుల బంగారుమూట
నలువచెలువ యధిష్ఠించి యలరుపీట.



సాటిపేటల నన్నింటి గోటమీటఁ
జాలు నీనాట మనయూరి సంతపేట ॥

క॥ కావునఁ గావ్యారంభము
గావింపుము శుభముహూర్తకాలమున భవ
ద్ధీవిలసత్కవితారచ
నావైశారద్యమును జనంబు నుతింపన్ ॥

వ॥ అని యానతిచ్చి ప్రోత్సహించుటయు నత్యుత్సాహంబునఁ బరమేశ్వరీ సమర్పణంబుగ నాయొనర్పంబూనిన కన్యకావిజయంబను మహాకావ్యంబునకుఁ గథాక్రమంబెట్టిదనిన సకలమునికుల శరణ్యంబైన నైమిశారణ్యమున శౌనకాది మహర్షులు సూతుంగాంచి

—* కథారంభము *—

క॥ ఆతత సకలపురాణా
ఖ్యాతా! సంతతనిజాశ్రితాఖిలదురిత
త్రాతా! సుగుణవ్రాతా!
సూతా! సన్మునికుల ప్రసూతా! పూతా!

క॥ ఘనచతురానన చతురా
ననముల వెల్వడెడు వేదనాదముగతిఁ బా
వన భవదాననమునఁ బడు
నెనిమిదియుఁ బురాణగాథలెఱిఁగితి మధిపా!॥

సీ॥ భక్తాగ్రగణ్యులపాలఁ గల్పకవల్లి గణనాథుఁ గడుపారఁ గన్నతల్లి
వలిమలరాజు నోములపంట ప్రేకగంటఁ గరుణించి దీవులఁగాచుదంట,
ముప్పురమ్మలలోన మూలంపుటమ్మ య వ్వేల్పుటమ్మల యిలవేల్పుటమ్మ
గట్టువిల్తునికూర్మి పట్టంపుదేవి, మేల్ చల్లనికరుణారసంపుబావి.
సామిసామేనుగైకొన్న చానమిన్న
వరలినదియంట యొకవైశ్యవరుని యింట
హృదయముప్పొంగఁగోరెద మదివినంగఁ
దత్కథంగూడఁ దెల్పుమో తపసిరేడ!॥

మ॥ భవపాపంబులు వాపునంచునిటు లా భర్గప్రియా సత్కథా
శ్రవణామోదులు శౌనకాదులు తనున్ బ్రార్థింప నానాపురా
ణవనాంతస్సుకథాసుమాపచయ సూత్నప్రజ్ఞుఁడాత్మ ప్రజా
త్యవివేకాంధతమః ప్రభాకరుఁడు సూతాఖ్యుండు ప్రీతాత్ముఁడై ॥

క॥ మనవిని విని యనునయమున
మునికుల తిలకులకుఁ బలుకమొదలిడె గిరనం
దన తనయంతన యొకనం
దనయై వైశ్యాన్వయమ్ము తనిపినవిధముల్ ॥

గీ॥ శ్రీమదాంధ్ర దేశారామ సీమనడుమఁ
బొలుపుగాంచిన తామరకొలననంగ
సద్ద్విజాళులుఁ బరమహంసలు వసించు
పురమొకండొప్పుఁ బెనుగొండపురమునాఁగ ॥

క॥ రండనదు పొండనదు గై
కొండన దాపైడికొండ కొండలలోఁ బె
న్గొండటయని తా నా పెను
గొండాఖ్యవహించి యార్తకోటిఁ బెనుచున్ ॥

ఉ॥ హారములోని ముత్తియములందున మేరువుపూసభాతిఁ గా
సారచరద్విహంగముల సన్నుతికెక్కిన రాజహంస నాఁ
పేరుప్రతిష్ఠగల్గి పురిపెద్దలకెల్లను బెద్దయై యశ
శ్శ్రీరమణీయుఁడై కుసుమశ్రేష్ఠివసించును దత్పురంబునన్ ॥

చ॥ తనకనుసన్నలన్ బహువిధమ్ముల వైశ్య కుమార రత్నముల్
వినయవిధేయులై మెలఁగ వేయికనుల్ గలవానికన్న న
త్యనుపమభోగభాగ్యముల నా పురమేలును దాఁ దనంతచే
రిన ఘనవైభవంబునఁ గిరీటము లేని నృపాలుపోలికన్ ॥

ఉ॥ ఆదినిగోలెఁ దత్పురికి నావలనీవలఁ జుట్టియున్న య
ష్టాదశపట్టణంబులఁ బ్రశంసకునెక్కిన వైశ్యకోటికిన్
దాద్ధారయై సమస్తకులధర్మములున్ నడపించు నీశ్వరా
పాదితశక్తి నక్కుసుమవైశ్య శిఖామణి యెల్లవేళలన్ ॥



సీ॥ నిరువేదవిద్యార్థు లరుదేర ముదమారఁ బరితృప్తులనొనర్చి పంపుచుండు
సుకవీశ్వరులుతన్నుఁ జూడవచ్చినయంతఁ గనకాభిషిక్తులగా నొనర్చు
దేవభూదేవసేవా విశేషములందు నందరికన్న ముందంజవేయు
అఖిలసత్కార్య ప్రయత్నమ్ములకు మార్గదర్శియై ప్రజలఁ బ్రోత్సాహపరచు
సకల వైశ్యసభా ప్రదేశములయందు
నగ్రపీఠాధికారంబు నందుచుండు
గురుఁడు విభుఁడు బంధుఁడు జనకుండు హితుఁడు
నాటిపెనుగొండపురి వైశ్య కోటికతఁడు ॥

శా॥ బారుల్ గట్టిన నౌకలంబనిచి యవ్వైశ్యోత్తముం డెల్లడన్
బారావారముపై నపారమగు వ్యాపారమ్ము సాగింప, నా
నారాజన్మణిపంక్తు లంబునిధిలోనం జారె నద్దాననే
తా రత్నాకరకీర్తిగాంచెను సముద్రస్వామి లోకంబునన్ ॥

క॥ ఆతనిసతికుసుమాంబ సు
నీతిమతి, స్వరూపవిభవనిర్జితరతి, వి
ఖ్యాతకలాజితభారతి
యాతతగుణవతి వహించె నమితఖ్యాతిన్ ॥

క॥ మృదురాజీవ పదమ్ముల
మదిరాజిలనొత్తి గొల్చుమగనిని, మగఁడున్
మదిరాక్షి నెన్ను నదిరా!
యదెరా దాంపత్యమన్న నదెరా సుఖమున్ ॥

కం॥ మనమా! నయమార్గంపుగ
మనమా! మానాభిమానమా! దీనజనా
వనమా! యొకటియె యైనను
దనువులె కనిపించు రెండుదంపతులయొడన్

కం॥ తల నల పురహరుఁడు నుర
స్థలి నల మురహరుఁడు సతులఁ దాల్చిన కథలన్
దలఁచెదరా పురమున జన
ములు తద్దంపతుల యైక్యమును బొగడునెడన్

ఉ॥ అంగమునన్ సగమ్ముగొనునంతటితో సరిగాక సర్వరా
జ్యాంగములందుఁ గష్టములయందు సుఖమ్ములయందు ధర్మదీ
క్షుం గొనుటందు నొక్కొకసగమ్మును బంచి గ్రహించి, మించి, య
న్రాఁగియనంగ నొప్పెఁ గుసుమాంబిక భర్తకు నన్నిభంగులన్॥

మ॥ మనప్రపద్యమ్మున కీడుచేడను సృజింపంగల్గితిన్ భారతీ
కనుమాయం చజుఁడాడ, నా నతనియాకారమ్మునాధారమున్
గొనికల్పించితి వట్టికల్కినని పల్కుంగల్కి పల్కన్ సృజిం
చెనుబో ధాత తదీయదంపతులఁ దాఁ జిత్తాన రోసమ్మునన్॥

మ॥ సకలైశ్వర్యసుఖమ్ములున్ గలిగియున్ సంతానరాహిత్యపున్
వికలత్వమ్మది పానకంపుఁబుడకై వేధింప వారిర్వు ర
య్యొకలోపమ్మును బాపుఁడంచు నిజవంశోద్ధారణార్థమ్ముగా
నకలంకాత్ములఁ బార్వతీశ్వరుల లో ధ్యానింతు రేవేళలన్॥

చ॥ కొడుకులు లేరటంచుఁ గడుగుందెడువారి కిడందు కూఁతునిన్
గొడుకునునైన, దీనులయి కూటికిగుడ్డకు లేనివారికిన్
గొడుకులఁ గూఁతులన్ దరుచుగూర్చు ననేకుల నిందు చేత నే
జడుఁడని యందు రీ భువనజాతమునన్ వనజాతసంభవున్॥

శా॥ కాంతాకాంతులు సంతతమ్మిటులుమాకాంతాది సద్దేవతా
సంతానమ్ము ననంతభక్తియుతులై సంతానరాహిత్యపున్
సంతాపమ్మునుబాప సిశ్చలనిజస్వాంతంబులంగొల్చి, తా
మెంతేఁ గాలముపుచ్చి రాత్మసుఖభోగేచ్ఛల్ విసర్జింపుచున్॥

వ॥ ఇట్లుండ నొకనాటిమధ్యాహ్నంబున నిజాంతఃపురంబున నక్కుసుమ వైశ్య
రత్నము రత్నప్రభాభాసమానంబగు హేమాసనంబున సమాసీనుండై యున్న యవస
రంబున, నక్కుసుమాంబయు మెల్లమెల్లఁగ నిజవల్లభుం జేరి, తత్సమయోచితోపచార
సల్లాపంబుల వానియుల్లంబు రంజిల్లంజేసి సందర్భయుక్తంబుగ నుభయంబుల వాని
కిట్లనియె.

ఉ॥ వేలుపుఁబెద్ద యే ననుభవించియెఱుంగని భోగభాగ్యముల్
వేలకువేలుగా ననుభవించితి నిర్వుర మాదినుండియున్
కాలగళాంగనాపదయుగస్మరణోప్సిత మొందుదక్కఁగాఁ
జాలును జాలునింక నిహసౌఖ్యములం చనిపించెఁ జిత్తమున్॥



ఉ॥ కానని వానికిన్ రజనికాంతుని కాంతులవింతలట్లు సం
తానము లేనివానికిఁ గనత్కనకాభరణాదివస్తు సం
తానము లేల? యీధనవితానము లేల? యమేయసుందరో
ద్యానము లేల? సన్మణి నిధానము లేల వృధాగదా సదా॥

చ॥ దినమణి రానిరోజు కడుధీమణిమంత్రి లేని రాజు వా
సనగన రానిపూవు బుధసంగతిగల్గనితావు రేనిపా
లనమున లేనిధాత్రి మృగలాంఛనుఁ డొప్పనిరాత్రి సంతతిన్
గనని విభూతి వ్యర్థములుగావె విభూతిని నేతిరీతిగన్॥

శా॥ నేనెన్నండు నపత్యవాంఛను భవానీదేవి నర్చింపనో
యేనోముల్ మఱియెట్టిదానములు నేనేనాడు. గావింపనో
జానో నా గతజన్మకర్మ ఫలమేయానింతయు న్నేడు సం
తానానందము గల్గునే కటకటా! నావంటి నిర్భాగ్యకున్॥

సీ॥ నెలతప్పెననిపల్కు చెలికత్తియలపల్కు లాలించుభాగ్యంబునందనైతి,
తినఁగోరునదియెల్ల నొనఁగూర్చుమాయత్త లాలనమ్మునుబొందఁ జాలనైతి,
పనిపాటులకుఁబంప కనుకంప ననుబెంప నాడుబిడ్డల ముద్దులందనైతి,
కొడుకొ కూఁతురొ కదా కుసుమాంబకని బంధు లాందోళనం బొందు టరయనైతి,
ఉత్సవముతోడ సఖులెల్ల రొకటఁగూడి
కడఁగి తొడగించుగాజులఁ దొడగనైతి,
ముదము గననైతిఁ గననైతి ముద్దుపాప
నకట! నిర్భాగ్యనైతి గొడ్రాలనైతి॥

చ॥ పసుపును నూనెరాసి పసిపాపకు వెచ్చని నీరువోసి, సం
తసమున మేడమీఁదిరతనాల యుయాలఁ బరుండవెట్టి లో
విసుగక జోలపాటలను వేడుకఁ బాడెడు భాగ్యమింక, నే
డెసగనుఁగొన్నఁ గేవల మదృష్టవిహీనకుఁ గల్గనేర్చునే?॥

ఉ॥ కంచమునందునం బిసిగి కమ్మనిపాలును బువ్వయున్, గన
త్కాంచన పంజరంబులనుఁ గ్రాలు శుకంబుల వ్రేలితోడఁ జూ
పించుచు బుజ్జగించి తినిపించుచు బిడ్డలముద్దులాడుటల్
సంచితపుణ్యకర్మ ఫలసంచయముల్ కద ప్రాణనాయకా!

శా॥ ఫాలంబందునఁ గ్రమ్ము ముంగురులతోఁ బంగారు మైచాయతోఁ
గాలందెల్ ఘలు ఘల్లుమంచు మొరయంగా నాడు నాట్యంబుతోఁ
బాలిమ్మంచును జేరవచ్చు పసిపాపం గౌఁగిటం జేర్చి, చ
న్నాలానించెడు ముచ్చటల్ గలవె యీపాపిష్ఠజన్మంబునన్॥

వ॥ అని యనేకవిధమ్ముల నమితైశ్వర్యధామయగు నక్కాంతాలలామ యాత్మీయాసత్యదారిద్ర్య దుఃఖాక్రాంతయై కొంతవగకుఁ జింతించి నిజవల్లభునకు వెండియు నిట్లనియె.

శా॥ యక్షస్వామికి సైతమున్ ఋణమునీయంజాలి యున్నట్టి యి
య్యక్షయ్యంబగు సర్వసంపద లవేలా యంచుఁ గర్తవ్యమే
నీక్షింపంగ, నుపాయమొండు గననయ్యెన్నాకు, సంతానపున్
భిక్షన్ బొందుట కింతకన్న గతి కన్పింపంగ రాదెచ్చటన్॥

క॥ మనకన్న నమితభాగ్య
మ్మునుబొంది యపత్య సౌఖ్యమునుబొందని వా
రనఘ లనేకులు పూర్వులు
చని రీ మార్గమునఁ బడయఁజాలిరి కోర్కుల్॥

క॥ ఒనరిచెనఁట ధశరధుడఁట!
ఘనతరమైనట్టి పుత్రకామేష్టియనన్
దనరిన జన్నంబఁట! యిటు,
వినుచుందుముకద! పురాణవీధుల నాథా!॥

క॥ దాక్షాయణీశ్వరులు ప్ర
త్యక్షమ్ముగభక్త కామితార్థమ్ములఁ దా
మక్షయ్యమ్ముగఁ దీర్పఁగ
నీ క్షితిసాధన మిదొకటియేనఁట! వింటే!॥

క॥ కాకుత్థ్సునంతవారము
గాకున్నను భక్తినతనికన్న నొకింతే
లోకువగాముగదా? యీ
లోకేశ్వరికేల దయగలుగకుండు నెదన్॥

గీ॥ వివిధనిగమాగమరహస్య వేదియగుచు
నార్యవైశ్యాన్వయపసిష్ఠుఁ డనఁగఁ దగిన



భాస్కరాచార్యవర్యుని ప్రాపుగలుగఁ
జేయరానిది మనకేది చెప్పుమనఘ!

ఉ॥ కాన నుమామహేశ్వరుల కారుణికత్వ మహత్వ సిద్ధికిన్
బూనియొనర్త మా సవనమున్ మనమున్ మనకయ్యపత్య సం
ధానము సద్యశమ్ము కులధన్యతయున్ సురవిప్రసేవయున్
దీన జనించు నింక వెనుదీయఁగనేటికి ప్రాణనాయకా?

చ॥ అనుచు హితోపదేశము సమంచితరీతినొనర్ప వించుఁ దా
ననిమిషభావమూని కుసుమాఖ్యుఁడు దీర్ఘవిచారమం దటుల్
మునిఁగి మునింగి యెప్పటికి మోమును గామిని వైపు ద్రిప్ప కా
ననియును గాదటంచుఁ బలుకాడక దాల్చెను జిత్రరూపమున్॥

ఉ॥ నమ్మిన దాసికైవడిని నాథునిఁ గొల్చి, యమాత్యునట్లు కా
ర్యమ్ములొనర్చి, తల్లియటు లన్నముఁ గూరిచి, రంభయట్లు త
ల్పమ్మునఁ దేల్చి నిత్యము మెలంగెడు నింతి, పురాకృతంపుఁ బు
ణ్యమ్ముల దొంతి కాక నిజమారయఁ గేవల మింతిమాత్రయే?

శా॥ రాగాక్రాంత నెలంత కాంతుని విచారస్వాంత మీక్షించి, లో
లోఁగార్యాచరణానుకూలగతి నాలోచించి ధైర్యోక్తులన్
దాఁ గర్తవ్యము తెల్పుచోఁ గలుగు నానందంబు వేరెట్లు సం
భోగానందముకన్న మిన్నయగుచున్ బొల్పారుఁ దద్భర్తకున్॥

గీ॥ కుసుమవైశ్యశిఖామణి కొంతవరకు
నటుల దీర్ఘవిచారమునందు మునిఁగి,
కడకు నొకపెద్ద నిట్టూర్పువిడిచి, యామె
కరము కరమునఁ గీలించి కౌఁగిలించి॥

చ॥ కనులఁ బ్రమోదబాష్పములు గ్రాలఁగఁ జెక్కిలిముద్దులాడి, తో
డనెమణిపీఠముం డిగి తటాలున నచ్చటనుండి సాగె నా
ననియును గాదటంచు సవనాంశము సెప్పక; యూరకుండె నా
వనితయు; లౌక్యదంపతుల వర్తనముల్ గన నిట్టివే కదా?॥

వ॥ పిమ్మట నక్కుసుమాంబయుఁ దదీయశృంగారచేష్టాదికంబులఁ దనవల్లభుండు పుత్రకామసవనక్రియాయత్తచిత్తుండౌట గ్రహియించి, సంతసించి యయ్యంతి

పురంబున నేకాంతంబుగఁ గొంతవరకుఁ బ్రొద్దుపుచ్చి సాయంసమారంభంబగు టయు, సనాతనాచారంబగు పార్వతీపరమేశ్వరార్చనంబునకు వేళయని తత్సౌధావరోహణ మొనర్ప నగ్గదివెడలి వెలుపలి కించుక యేతెంచినంత,

సీ॥ ఆచంద్రతారార్క మార్యవైశ్యకులంబు ప్రఖ్యాతిగనునంచుఁ బలుకువారు
ఇందాక మనపూర్వులెవ్వారు నింతటి ఘనకార్యమొనరింప రనెడువారు
కుసుమదంపతుల కోర్కులదీరునటు దేవ దేవుని దేవి నర్థించువారు
గ్రంథాలవిను పుత్రకామేష్టి సవనంబు కనులార నిఁకఁ జూతుమనెడువారు
పలువిధంబుల నుత్సాహపడెడువారు
వేలువందలు వైశ్యులవ్వేళఁ గొలువు
కూటముననుండి గుంపులుగూడి వీథిఁ
జనుట గనిపెట్టె నక్కాంత గుణనితాంత॥

ఉ॥ ముందర నేగు వైశ్యగురుముఖ్యునిజుట్టుచు "శ్రేష్ఠిరాజు, మీ
యందె తదీయ భారమును నంతయుఁ బెట్టె ముహూర్తనిర్ణయం
బందిఁక జాగుసేయక కృతార్థులఁ జేయుఁడు మ"మ్మటంచు, వా
రందరు వేడుకొంట చెవియంట వినెన్ గుసుమాంబయయ్యెడన్

చ॥ అటువిని హర్షఫుల్లహృదయాంబుజయై తన విన్నవించుకో
న్నటులె మనోధవుండు సవనాంశము కొల్వున నిశ్చితంబు సే
యుటగ్రహియించి యంత నగజోరగభూషణులం దలంచి, య
న్నటదలినీలకుంతల మనంబునఁ గొల్చె నిమీలితాక్షియై॥

గీ॥ భక్తిమెయి నప్పురాణదంపతులనట్లు
కొంతవరకు ధ్యానించి యక్కాంత దైవ
ఘటనకున్ మెచ్చి మూసినకనులువిచ్చి
సాంధ్యరాగద్యుతులఁ గ్రాలు చదలుగాంచె॥

మ॥ కుసుమాంబాసతివోలె నీవెపుడు నాక్షోణీధరాజాత పా
దసరోజాతము లేలకొల్వ వను భర్తం జాల మన్నించి, దే
వి సమారాధనసల్ప నయ్యపరదిగ్విద్యుల్లతాదేహ సొం
పెసఁగన్ దాల్చినపట్టు పుట్టమటు లెంతేనొప్పె సాంధ్యప్రభల్ ॥



క॥ కుసుమాంబకాంతకప్రియ
కుసుమాంగిపూజకొఱకుఁ గుసుమావళితోఁ
గుసుమాంబకు నారవదగు
కుసుమాంబకమనఁగ వెడలెఁ గుసుమాంబయుఁ దాన్ ॥

వ॥ అమ్మరునాడు భాస్కరార్యుండును బుత్రకామ సవనసుముహూర్తము విధి విధానంబుగ నిర్ణయించి కుసుమశ్రేష్ఠికెఱింగింప నవ్వైశ్యకులాగ్రణిపరమానందభరితుండై పార్వతీపరమేశ్వర ప్రీత్యర్థమ్ము తనయర్థమ్ము సర్వమ్ము తత్సవనవ్యాజమ్మున వెచ్చింపనిశ్చయించి, యప్పురవరమ్మును బలుతెఱంగుల సింగారింపఁ జేసి, విశ్వకర్మవినిర్మితంబులగు నష్టాదశ వైశ్య పట్టణంబులంగల యేడునూరుల పదునాలుగు గోత్రంబుల వణిగ్జనులకెల్ల శుభలేఖలనిపి యాంధ్రప్రపంచంబునందంతటంగల సకలబ్రాహ్మణజాతమ్మునాహ్వానించి, రాజసూయమహాధ్వరంబునకుం బాండవాగ్రజుండువోలె మహావైభవంబున సతీసమేతుండై పుత్రకామసవనక్రియ కుపక్రమించి భాస్కరగురూపదిష్టమార్గంబున నిర్వర్తించుచుండెనంత,

శా॥ ఆ కైలాసమునందు హేమమణిసౌధాగ్రంబుపై నంబికా
రాకాచంద్రనిభాస్యతో సరసవాక్ప్రౌఢిన్ వినోదించు నా
శ్రీకల్యాణగుణుండు శంకరుఁ డుమాసీమంతినిం జూచి, కాం
తా! కాత్యాయని! మర్త్యలోకపు వినోదంబుల్ విలోకించితే? ॥

గీ॥ నాటి దశరథాదులువోలె మేటియైన
వైశ్యకులరత్న మొక్కఁ డపత్యవాంఛఁ
బుత్రకామ మహాయాగమునకుఁ బూనెఁ
గంటె? కలకంఠి! యనుచు ముక్కంటి మఱియు ॥

ఉ॥ అంబుభవాస్య చూడు మఖిలార్యవణిక్పతియాచరించు యా
గంబునుజూడ వేలుపులు కాంతలు కాంతులు సైతమున్ విమా
నంబులపైని నెట్లు గగనంబున నిల్చిరో? నిన్ను నన్నుఁ జి
త్తంబున నింతగాఁ గొలుచు దంపతులుందురె భక్తకోటిలోన్

చ॥ అతులితరీతి బ్రాహ్మణులనందరి దక్షిణలన్ స్వబాంధవ
ప్రతతినిగౌరవమ్మున శుభప్రదుఁడౌ మన వీతిహోత్రునా
హుతఘృతధారలన్ స్థిరతరోన్నతభక్తిని నిన్ను నన్ను నీ
గతిఁ బరితృప్తులన్ సలుపఁ గల్గెడు దంపతులుందురే సతీ! ॥

మ॥ అతులప్రోద్ధత హోమకుండజనితోద్యత్సాంద్ర ధూమచ్ఛటా
వృతమై సూర్యరథంబుమార్గమెటులో వీక్షింపలేకుండెఁ ద
త్క్రతు ధూమాతిశయంబుచేత మనమున్ గైలాసమందుంటిమో
సతి ! నీపుట్టినయింట నుంటిమొకదే ! చర్చింపరాదియ్యెడన్ ॥

క॥ సంతానంపుఁ గోరంతన్
సంతానంబొందునట్టి సతికిఁబతికిన్
సంతాన మిడుటకన్నను
గాంతామణి! కలదె వేరుకర్తవ్యమిలన్ ॥

క॥ అర్థించినట్టి యర్థుల
యర్థమ్ముల వ్యర్థపఱచి యనిపిన మనకున్
సార్థక్యమున్నదే? చం
ద్రార్థలసత్ఫాల! ఓ హిమాచలబాలా! ॥

క॥ అన్నలమిన్నలు పురుషుల
కన్నను గడుజాలిగుండె కలవారని నీ
వెన్నెన్నోమారు లంటివి!
యన్నట్టుల శ్రితులనేల నరయువదేలా? ॥

క॥ పురుషులు నీవన్నటు లే
తరుణులకును సాటిగారు తథ్యమ! యందే
నరమేనివాఁడ నొకటి
న్నరమేనినెలంత వీవునగరాట్తనయా! ॥

చ॥ అనియిటు దేవదేవుఁ డచలాత్మజ నించుక మేలమాడ నా
ననమున మందహాసమొక నవ్యవిలాసముఁగూర్ప నాజగ
జ్జనని శిరమ్మునూచి యను, సత్యముసత్యముప్రాణనాథ! లోఁ
గనికర మెక్కుడేయగునుగాంతకుఁ బూరుషుకన్న నెంతయున్ ॥

చ॥ పురుషునిగుండెరాయియని పోలిచియేకద యాదిలక్ష్మి తా
నురమున వాసముండె పురుషోత్తముచిత్తము మెత్తమెత్తగాఁ
గరగఁగఁజేయు నాశ్రితులఁ గాచెడుపట్టున, నందుచేత నే
వరదుఁడు సాధుభక్తజనవత్సలుఁ డన్నుతిగాంచెనాతఁడున్ ॥

ఉ॥ కంటను నగ్గిమంటలును గంఠమునందు విసమ్ము,భూషలై
యొంటను బాములుఁగలిగియుంటనెకా! తపమాచరించి, మీ



వంటిమహాత్ములిట్లు హిమవంతుని కూఁతుని భార్యగాఁగఁ గై
కొంట, నగంబుమేనిడుట కోరెనెలన్ దలఁదాల్చియుంటయున్ ॥

క॥ నగరాట్తనయా! యనినన్
నగుబాటునఁ బిల్చిరైన నాజనకుఁడు దా
నగరాజయ్యును బొగడన్
దగినహిమాలయుఁడు నే నతనితనుజాతన్ ॥

వ॥ అని కరపల్లవంబులుమోడ్చి

క॥ నగకందరమందిర! యో
నగధరహిత! చారుమేరునగకోదండా!
నగరూపధార! దీనను
నగరాట్సుతనిట్లు హేళనము సేయుదురే? ॥

క॥ అనిసాభిప్రాయమ్ముగఁ
దనుప్రార్థించినవిధానఁ దగుయుక్తిని బ
ల్కినపల్కుల కలరి భవా
నిని గ్రక్కునఁ గౌఁగిలించినెలతాల్పనియెన్ ॥

మ॥ పరిహాసమ్మున కంటి నైన వినుమో పద్మాస్య! నీకై తపో
నిరతింబూనిజపించి తత్ఫలముగా నిన్నొందితిన్, యోగ్యలా
సుతులన్ బత్నులు సత్తపోఫలము లేసుమ్మీ! యపత్యార్థులై
సతతంబిట్లు తపించు దంపతులవాంఛల్ దీర్పు మీవుంగృపన్ ॥

శా॥ ఆయాగంబుఫలంబుగాఁగ మది నేయానంద మర్థింతురో!
యాయానందము నేనుగూర్చెదను బుత్రాకారతన్ నీవునున్
నీయంశంబుననొక్క పుత్రినిడి మన్నింపందగుంజమ్ము ప్రా
లేయోర్వీధర కన్యకాతిలకమా! లేలెమ్ము జాగేటికిన్ ॥

వ॥ ఇట్లుపలికిన పతియానతి మాళిందాలిచి, యన్నగరాజనందన యమందానందమ్మున నిందుధరు చరణారవిందమ్ములకు వందనమ్ములొనర్చి, నిజాశ్రితార్థప్రదాయకత్వమ్మును బృందారక బృందమ్ములు పలుచందమ్ము లభినందింప, రాజతాచల కందర సుందర మందిరము వెలువడి శరత్కాల నీరదనిర్గతంబగు మెఱుంగు తెఱంగున నవ్వెండికొండనుండి భూమండలమ్మునకుం డిగ్గి, పెనుగొండ నఖండవైభవంబున మదవేదండతుండనిభాజ్యధారా నుండితంబై, సప్తాహంబులునుండి ప్రచండంబుగ మండెడు

యాగంపుఁ గుండంబునం దావిర్భవించి, తదగ్నికుండ మధ్యంబునం బొడసూపునిజామధ్య మస్తకమాత్ర గాత్రంబు వినూత్నరత్నాభరణ భూషితంబై యమ్మహాయాగ సంద ర్శనాగత నానావైశ్యకులాభరణంబుల నేత్రంబులకు మిఱుమిట్లుగొలుపఁ గర్ణ సువర్ణ తాటంకమణి ముక్తా ఫలద్యుతులు ధగద్ధగితాయమానంబులగు చెక్కుటద్దమ్ములం బ్రతిఫలింప సుందరాధరబింబ ఫలారుణ కిరణంబులు దంతంబులదాడిమీఫలబీజ భ్రాంతి గల్గింప, అరచందురు నిరసించు నెన్నొసటఁజెన్నెసలారు ధనురాకార సిందూర రేఖ యగణ్యముఖలావణ్యమునకుఁ గ్రొత్తవిన్నాణంబు గూర్ప విలాసార్థం బమవసనిశీ నాకసంబునందోచు ఖరకర సుధాకర తారకలకరణి సూర్యచంద్రాద్యనేక శిరోభూష ణంబులు మెఱయ - మందహాస భాసురంబులగు కరుణాకటాక్ష వీక్షణంబుల నక్కు సుమదంపతుల జన్మంబులు ధన్యంబులొనర్చ - హేలోకమాతా! త్రిలోకైకపూతా కృపాపోషితేంద్రాది దిక్పాలకవ్రాత! కారుణ్యచిత్తా! నమస్తే నమస్తే యటంచు ధ్యానించువైశ్యలోకంబెల్ల సక్కజంబొందఁ బ్రత్యక్షమ్మగ నవ్వధూవరులకుఁదత్పూర్వ జన్మ తపోఫలంబన సంతానఫలప్రదంబగు కల్పకఫలద్వయంబు ప్రసాదించి, ఓవైశ్యో త్తమా! యేతత్ఫలయుగం బారగించు నీకులకాంతయందు నీకుం బుత్రపుత్రికా భాగ్యంబు చేకూరునని యనుగ్రహించి యప్పరమేశ్వరి యంతర్ధానంబయ్యె

క॥ వేలుపులు పూలవానల
నాలిమగల గౌరవించి రటగలుగు వణి
గ్జాలమ్ము సన్నుతించెను
జాలించెను భాస్కరుఁడును జన్నంబంతన్ ॥

క॥ పరమేశ్వరీ పదాబ్జ
స్మరణమె లోకంబుగాఁగఁ జరియించు వధూ
వరులిరువురుఁ బూజించిరి
యరుదగు కల్పకఫలద్వయము నురుభక్తిన్ ॥

మ॥ శుభలగ్నంబునఁ దత్ఫలద్వయము దాశుద్ధాత్మయై దేవతా
ప్రభుకాంతామణియాజ్ఞరీతిఁ గుసుమాంబారత్న మాత్మేశుచెం
తభుజించెన్ ఘనకల్పకద్రుమఫలాంతస్సారసన్మాధురీ
విభవంబుల్ జవిచూడలేక యత డువ్విళ్ళూరి వీక్షింపఁగన్ ॥

మ॥ ఫలయుగ్మంబుభుజించి గర్భవతియై భామాలలామంబు తా
నెలలన్ దొమ్మిదిమోసి భర్తయభినందింపన్ వెలుల్ సర్వ బం



ధులు సుపొంగఁగఁ గాంచెఁ దాఁగవలఁబుత్రున్ బుత్రికారత్నమున్
గలదేయెంమను నీశ్వరాజ్ఞవ్యతిరేకంబాట లోకంబునన్ ॥

వ॥ అని యివ్విధంబున సూతుండెఱింగించిన శౌనకాదు లమందానందచిత్తులై తదనంతర కథావిధానము వినంగోరుటయు

క॥ సురనుత చరణాబ్జాతా!
నిరతమహానందచిత్త! నిర్జితసకలా
సురవీరవ్రాతా! గురు
తరసుగుణోపేత భూమిధరరాజసుతా! ॥

గద్య॥ ఇది శ్రీమదోభగరాజవంశపయఃపారావార రాకాసుధాకర రామయామాత్యపౌత్ర
బాలాప్రసాదరాయతనూభవ విజయనగరమహారాజాస్థానాంధ్రకవి
పదధారేయబుధవిధేయ నారాయణమూర్తి నామధేయ
ప్రణీతంబగు కన్యకావిజయంబను మహాప్రబంధంబు
నందలి ప్రథమాశ్వాసము.





శ్రీ

# కన్యకా విజయము

## ద్వితీయాశ్వాసము.

క॥ కైవల్య సౌఖ్యదాయిని !
స్థావరజంగమ పదార్థసంస్థాయిని ! నా
నావిబుధకార్య కారిణి !
భావజరిపురాణి ! శ్రీభవానీ ! జననీ ! ॥

వ॥ అవధరింపు మట్లు ప్రార్థించిన మహర్షులకు సూతుండిట్లనియె.

భాసుర చంద్రకాంతమణి వాసగృహంబున నూత్నరత్న హే
మాసనసీమనున్న తనకా శుభవార్తను జెప్పినట్టి ధా
త్రీసురవర్యుఁ దాను బ్రణతించి కడుం బ్రణుతించి కాన్కఁగా
దోసెడు కాసులిచ్చె గుణధుర్యవహుండా కుసుమార్యుఁ డయ్యెడన్.

గీ॥ జాతకర్మాదివిధులు శాస్త్రప్రకార
మతఁడు చేయించె సుతునకు సుతకుమఱియు
గురునియుక్తిని ధారుణీ సురలకొసఁగె
వివిధదానాళి నవ్వణిగ్విబుధ మాళి ॥

వ॥ మఱియు నమ్మహనీయుండు సకలబంధు జనసమ్మతంబునఁ బుత్రునకు విరూపాక్షుండనియుఁ బుత్రికకు వాసవాంబయనియు నామకరణంబు లొనర్చుటయు,

క॥ బాలేందురేఖవలె న
బ్బాలామణి దినదిన ప్రవర్ధని యగుచున్
హేలాగతి సాటివణి
గ్బాలామణులందు మిగుల భాసిలఁ గడఁగెన్ ॥



సీ॥ లలినుంగరపు ముంగురుల మఱుంగుతొలంగి కమనీయముఖకాంతి గంతులిడఁగ
పాలబుగ్గలు లొత్తవడ నవ్వు చిఱునవ్వు నలువలంకులను వెన్నెలలఁగాయ
అసమాన సౌందర్య వసతియా నునుమేని పసుపుపచ్చనిచాయ పసలెసంగ
గండుతుమ్మెదపిండు గండడంచెడు రెండు కనులనుండియు మెండుకలుములొల్క.
జననియొడియందొ జనకునుత్సంగమందొ
చూడవచ్చిన చుట్టాల చూపులందొ
నాగరాంగనాలింగనాంతరములందొ
యుల్లసిల్లును నబ్బాల యెల్లవేళ ॥

చ॥ కటకటసంపదంధుఁడయి కారియవెట్టెను గూఁతునల్లునిన్
గుటిలతనొక్కతండ్రి; పెనుగొండమరొక్కఁడు; పుట్టినింటి ము
చ్చటలిటులెందుఁ దీర కలశంకరు రాణిజనించెనమ్మ ! యెం
తటి సుకృతాత్ములో కుసుమదంపతులంచు నుతింతురెల్లరున్ ।

చ॥ అనిశమునార్యవైశ్య జలజాస్యలకౌఁగిళులందుఁ జేరి చం
దనహిమవారిపూరయుత తత్తదురోజనగాగ్రసీమలం
దనువుగసంచరించుఁ గుసుమాంబకుమారిక; పూర్వజన్మ వా
సనలుతొలంగిపోవుకద సత్యముగా నెటువంటివారికిన్ ॥

ఉ॥ సంతతికై సతీపతులు సంతతముం గడుఁ బల్వరించి, యా
సంతతి గాంచినంత నిహసౌఖ్యములందు విరక్తిఁబొంది, ని
శ్చింతగనింక మేనులుత్యజించి సదాశివసన్నిధిన్ బ్రవ
ర్తింతుమెయంచు నెంతురు స్మరింతురు గొల్తు రుమామహేశులన్ ॥

సీ॥ అవ్వయంచును దాతయంచు వచ్చియురాని
పలుకులా బాలిక పలుకునాఁడె
పడుచు లేచుచు వెండి నడచి వ్రాలుచుఁ దప్ప
టడుగు లా బాలికయిడెడునాఁడె
కనుఁగొన్న దెల్లఁ దెమ్మని పట్టుపట్టి ప
ల్మారు లా బాలికపోరునాఁడె।
మంజులగతి నోన్నమ శ్శివాయయటంచు
నోట నా బాలిక నుడువునాఁడె।

జరయెమ్మృతియంచు, నరునకు జననమరణ
ములు తొలఁగవంచు, నింద్రియములను గెలుచు
టరుదనుచు, జన్మలుడుగఁ బంచాక్షరీమ
హిమనటంచు గ్రహించి రయ్యిరువురొకట.

ఉ॥ ఆటలఁ బాటలన్ జదువునందునుజక్కఁదనంబునందు నా
నాటికపూర్వమై వెలయు నవ్యమహామహిమంబు చూపునా
బోటి యుమాంశజాతయని పొల్చి యుమాపరమేశులందొగిన్
గాటపుభక్తినైక్యమయి కన్పడుచుండ్రు సతీపతుల్ సదా.

ఉ॥ తల్లియుఁ దండ్రిబిడ్డలను దారు చికాకు వహించు వేళలం
దుల్లమునంగడున్ విసిగి యూరక దూరెద రట్లుకాక, యా
తల్లియుఁ దండ్రిమాత్రము సుతన్ గఠినోక్తులఁ బల్కరాగ్రహం
బొల్ల రెదన్ జికాకుపడ రొక్కఁపుడున్ విసుగూన రింతయున్॥

ఉ॥ కన్నది యోగమాయ నల కంససహోదరి యేనిముచ్చటల్
గన్నది పాపమోకుసుమకాంత! యదృష్టమనంగ నీదియే
యన్నివిధాలనంచుఁ జెలులందఱుఁ బల్కుచునుందు; రున్నవే
యన్నుల మిన్న లెంచెఱుఁగనట్టి పురాణకథార్థజాలముల్॥

ఉ॥ ప్రాజ్ఞతగన్న నందనునిపై వ్యవహారభరంబుమోపి, లో
కజ్ఞుఁడు తద్వణిగ్జన శిఖామణి నిత్యము భార్యతోడఁ ద
త్త్వజ్ఞులమధ్య శైవమతతత్త్వ విచారమొనర్చుచున్ మహా
ప్రజ్ఞ గడింపుచున్ గడపుఁ బండితగోష్ఠిని కాలమంతయున్॥

ఉ॥ జ్ఞానమువచ్చి గ్రంథములఁగాంచుట యందున కాలమంతయున్
దా ననిశంబునున్ గడుపుఁ దామరసానన వాసవాంబ; స
ద్గానము నేర్చె నాగమవితానము నేర్చె ననన్యసాహితీ
జ్ఞానముగాంచె యౌవనము గాంచకమున్న సమస్తవిద్యలన్॥

చ॥ గురువులయొద్ద కింకఁజనఁగూడదు తల్లిరో! చాలునమ్మ నీ
కఱచిన విద్య లీపయి సుఖంబుగ లోపలి సౌధసీమలన్
నిరతము సంచరింపవలె నీవని తల్లివచించుదాక, దా
గురువులఁ బాయ దా భ్రమరకుంతల శాస్త్రవిచారలోలయై॥



క॥ చారువసంతాగమమున
నారామముపోలెఁ గోమలాంగప్రాత
స్ఫారద్యుతి పెంపొందెను
నారామామణికియౌవనాగమనమునన్॥

శా॥ ఆకన్యాకరపల్లవగ్రహణ భాగ్యంబూని యింద్రత్వమీ
లోకంబందెవఁ డూనునోయనుచు లోలోనెంత్రు వైశ్యాత్మజుల్
ఆకైలాస మహాచలంబు ననెకా కాకన్యకున్ స్వామి, యే
లోకంబందును లేఁడటంచు నెటులాలోచింతు రింతేనియున్॥

ఉ॥ జక్కుల రేనికిన్ ఋణమొసంగ సమర్థులమంచుఁ జాలఁ జే
రెక్కినవారు కోడలిగ నిమ్మనికన్యను గోరవచ్చి, తా
మక్కమలాస్య దివ్యరుచిరాకృతినారసి, నోరువిప్పలే
కక్కుసుమార్యునొద్ద సెలవంచును బోయెద రెందరెందరో?

మ॥ చిననాఁడొజ్జల పజ్జకేగునెడనా సీమంతినింజూచి, యా
వనమం దీ లలితాంగిఁగాంచి యెవఁడాపంజాలు ధైర్యంబటం
చును భాషించు కుమారులాయువతినిన్ జూడంగ యత్నింత్రు త
ద్వనసీరంధ్రలతాకుడుంగ నిచయాంతస్స్థాఘ సర్వాంగులై.

శా॥ ఆతన్వంగి యగణ్యరూపగుణ విద్యాలీల లాలించుచున్,
జేతోజాత శరాహతాత్ములగుచున్ జీర్ణించి, యెవంకనో
యాతాయాతగతిన్ సతింగని తదీయామానుషాకార రే
ఖా తేజోన్నతి మ్రొక్కిపోయెదరు నిష్కామాఢ్యులై కాముకుల్.

వ॥ ఇట్లు వీక్షణమాత్రంబున నిజదివ్యతేజో విశేషమ్మున దేవతాభావంబు గల్పించు నక్కురంగనయనకుఁ దగు వరుంగానక, చింతాక్రాంతుండై యశ్రాంతంబు వరాన్వేషణం బొనర్చుచుఁ గుసుమార్యుండొక నాఁడు నిజసభామంటపంబున వేదవేదాంగ పారంగత జ్యోతిషభిషగ్వరహితపురోహితబాంధవ సందోహంబు తోడం గూర్చుండియుండఁ గొందరు చారు లరుదెంచి,

ఉ॥ రాజితకీర్తిశాలియగు రాజమహేంద్ర వరుండు వాహినీ
రాజసమేతుఁడై మనపురమ్ము సమీపమునన్ వసి

రాజమునన్ వసించెను, ధరాపతి మిమ్ములఁజూచు కోర్కెతోఁ
దాఁ జనుదెంచి నాడనచుఁ దద్భటులందురు వైశ్యసత్తమా!

చ॥ అని వచియించినంతఁ గుసుమార్యుఁ డహోఘనుఁడైన విష్ణువ
ర్ధన నరపాలుఁడా? యతఁ డుదారుఁ డుదంచితకీర్తిసారుఁడా
మనుజ పతీంద్రు దర్శనము మాకును మోదమ! యంచుఁబల్కియ
జ్జనపతి పంచినట్టి పరిచారుల నెంతయు గౌరవించుచున్॥

శా॥ రాకాచంద్రుని దర్శనమ్మల సముద్రస్వామికింబోలె, నా
మాకున్ మోదము రాజదర్శన మిదేమధ్యాహ్న మందాధరి
త్రీకాంతాగ్రణి దర్శనార్థమయి యేతేరంగనున్నాము, మీ
రాకన్ వైశ్యులు ధన్యులైరనుచు మీరాజేంద్రుతోఁ బల్కుఁడీ!

క॥ అనివచ్చినచారులఁ దా
దనచారులఁగూడనిచ్చి తత్క్షణమున నే
పనిచి, నియోగించెను దగు
మనుజుల నా ధారుణీంద్రు మన్నింపంగన్॥

ఉ॥ నాలుగువేల సైనికులు నల్వదియేన్గు లురెండువేలగు
ఱ్ఱాలునుగాక వెండియు ధరావరువెంటఁ బురోహితాది వి
ప్రాలియు సేవకాళి యరయం జెఱియొక్కశతమ్మునుంట ధీ
శాలియెఱుంగఁజాలె నిజచారముఖంబున నన్నిసంగతుల్॥

చ॥ ఎఱిగిసమస్తవస్తువుల నిచ్చెడు వేలుపుటావు వోలె భూ
వరునకు వింతగల్గఁ బరివారమపారముదంబుఁ జెందఁగాఁ
దరుగని సర్వభోజనపదార్థములున్ సమకూర్చిపంచె నా
వరకుసుమార్యరత్నము నృపాలున కాతనిసర్వసేనకున్

ఉ॥ కూరలుగాయలున్ గుడము గోధుమపిండియుఁబంచదారయున్
సారఘృతంబు గోదధియు సన్ననిబియ్యము చాయపప్పు ల
వ్వారిగ సర్వ మాఘనుఁడు పంచెను, గార్యముపట్లనమ్మహో
దారత యార్య వైశ్యునకుఁ దక్క మఱొక్కని కబ్బనేర్చునే॥

ఉ॥ తేనెలుఁ బానకంబులును దీయనిపండ్లును జీడిపప్పు నా
పైని హిమాంబు వత్తరు జవాదియు నాదిసు గంధవస్తు సం



తానము వక్కలాకులును దద్రసవర్గము రాజుతోడఁ ద
త్సేనకు నాల్గువేలకును దృప్తిగఁ బంచెనతం డుదారుఁడై॥

వ॥ ఇట్లు సమస్తంబును సమకూర్చి నాఁడు రఘునందనునకు భరద్వాజుని చందంబున నానందకరంబుగ విందొనరించి తానును నాశ్రితహితబంధువ్రాతసమేతమ్ముగ సరసపదార్థ సంపన్నంబైన యన్నంబు భుజించి, యమ్మధ్యాహ్నంబున సకలంకాంబరాలంకారుండయి వైశ్యకులాలంకారులు శతద్వయ పరిమితంబుగఁ దనవెంటనంట భాస్కరార్యపురస్కారమ్ముగ నిజమందిరంబు నిర్గమించి మెల్లమెల్లగఁ దత్పురపరిసరంబు నంగల సుందరారామ సీమసమీపించి యందు వందలకొలందింగల పటకుటీరపటలం బరసి మిక్కిలి యక్కజపడుచుఁ దత్ప్రాంతసంచార చారముఖంబున ధరారమణుండుండు గుడారం బెఱింగి యద్దెసకించుక మరలినంతఁ దద్రాజోద్యోగులు పలువురు బిరబిర నెదురుగ నరుదెంచి సగౌరవమ్ముగఁ బ్రభుసాన్నిధ్యంబునకుం గొనిపోవఁ దత్పటకుటీరాంతరంబున నున్నతాసనాసీనుఁడై యున్న విష్ణువర్ధనుంగని యవైశ్యకుల వర్ధనుండు నిజపరివారయుతంబుగ నమస్కరించి తన కేలంగల ముత్యాల పేరన్నేలరేని కంఠానఁ గానుకగా నిడిన నమ్మహీరమణుండు నిర్భరానంద భరితుండై బహుభంగుల బహూకరించి యుచితాసనాసీనులఁ గావించి మందహాస సుందరవదనారవిందుఁడయి యక్కుసుమార్యున కిట్లనియె.

ఉ॥ సంతతమున్ ద్వదీయగుణసంపదలెల్ల మదీయరాజ్య మం
దంతటఁ బర్వియుంట ముదమందుచు నుందుము నిన్ననంగ మా
యింతకు విన్నదానికిని నిప్పుడుగన్నులఁ గన్నదానికిన్
సుంతయు లేదుభేదము యశోనిధివార్యవణిగ్జనాగ్రణీ॥

ఉ॥ ఆకులుఁబోకలాదిగ సమంచిత సర్వపదార్థజాలముల్
చేకురఁజేసినావిచటఁ జెందిన గౌరవమింతదాక మే
మేకడ నెవ్వరుంజరుప నెన్నఁడుఁగానము; గానమిట్టియ
స్తోకతపోనిధానమును దొల్లిటివారల నేటివారలన్॥

ఉ॥ సంపదలున్నవారు గుణసంపదలుంగలవార లన్నిటన్
బెంపుగలట్టివారలును విప్రులరాజుల వైశ్యులందుఁ గ
న్పింపరె? యెవ్వరైనను గణించిరె వారలనింతగాఁ దప
స్సంపదలేని యే యితరసంపదలైనను సొంపు నింపునే?

క॥ భక్తుండవు శ్రితరక్షా
సక్తుండవు సద్గుణ ప్రసక్తుఁడవు మహా
వ్యక్తుండవు బహుసంప
ద్వ్యక్తుండవు నిన్నుఁబోలు నొరులున్నారే॥

చ॥ నగరముఁ బాసినాము పదునాలుగు మాసములయ్యె మేము కా
శిగయప్రయాగమున్నగు ప్రసిద్ధములైన సమస్త తీర్థముల్
తగఁ జరియించి క్రమ్మరి ముదంబున నద్దెసనుండి వెన్కకున్
దగిలి పురంబు చేరకయె దగ్గరినారము రామసేతువున్॥

శా॥ ఆరామేశ్వరమీవలంగలుగు నాయాతీర్థముల్ చూచుచున్
జేరన్ వచ్చుచుఁ బండరీశ్వరుఁ గడున్ సేవించి యా పైమహా
దారస్వాంతుని వేంకటేశవిభునిన్ దర్శించి యామీఁద నా
శ్రీరంగంబున రంగనాథు పదరాజీవంబు లర్చించుచున్॥

వ॥ అచ్చటఁ గొన్ని దివసంబులు వసించి తీర్థయాత్రాపర్యటనంబంతతోఁ జాలించి పురమ్మునకు మరలుచు మార్గమధ్యంబున నిప్పెనుగొండం బెనుగొండ వతెంగంటిమని వెండియు నిట్లనియె.

ఉ॥ కంటిమి తీర్థసీమలధికంబుగ దాననగణ్యధన్యతన్
గొంటిమి గాని మాకుఁ బెనుగొండను బోలిన పుణ్యతీర్థమున్
గంటకు వింటకొక్కటియుఁ గన్పడ దా బహుతీర్థసేవల
న్నింటి మహాఫలంబుగ గణించెద మీపురిఁ జేరఁ గల్గుటన్

చ॥ కుతుకముతోడ మాకుఁ బెనుగొండమహాపురతీర్థసేవయే
గతియగునంచు మేము బహుకాలమునుండి తలంతుమైన, మే
మితరములైన తీర్థములనెల్లను జూడక దీనిఁ జూచినన్
బ్రతిఫలముండదేమొయని ప్రప్రథమంబునఁ జేరలేదిటన్

ఉ॥ తీర్థములన్నియుం గని నదీనదపూరములన్ మునింగి యీ
తీర్థముఁ జేరినాము కలతీర్థములన్నిటియందు మాయభీ
ష్టార్థము నిర్వహించి చరితార్థులమమ్మొనరించు తీర్థమీ
తీర్థమెగాన నింక వెనుదీయఁగ నేటికి నాలకింపుమా॥



మ॥ అమలస్వాంత! జగత్ప్రసిద్ధగుణ విద్యారూపలావణ్యశీ
లములం గన్నది నీదు చిన్నదని పల్మారుల్ వినన్ వచ్చు నే
యమరస్త్రీయొ యదేమి శాపముననో యాలీలనీ బాలయై
కొమరొప్పన్ జనియించెనన్న జనవాక్కుల్ విందు మెందేగినన్॥

క॥ ముక్కోటి దేవతలలో
జక్కులు మీకులమువారు చర్చింపఁగ నా
జక్కులకుల కన్యయె నీ
కిక్కరణిని జిక్కెనంచు నెంచెద ననఘా॥

క॥ జన్న మొనర్చితివఁట! యా
కన్నియ తత్ఫలముగాఁగఁ గల్గినదఁట! యా
జన్నమునకైన రొక్కం
బెన్నెన్నో లక్షలంట! యిటువిందుఁ జుమీ!॥

క॥ చేసితివి యాగ మందుకుఁ
జేసిన వ్యయమెల్ల మేమెచెల్లింతు మణా
పైసలతో నీవిందుల
కే సందియ మొందఁబోకుమీ కుసుమార్యా!॥

ఉ॥ సజ్జనకోటి కెల్లపుడు సాయమొనర్చుట రాజధర్మమా
సజ్జననాథునాజ్ఞ శిరమందిడుటల్ ప్రజకెల్ల ధర్మముల్।
ఎజ్జనుఁడైననట్లు వహియింపని మూర్ఖుఁడొకప్పుడున్నచోఁ
దజ్జనపాలు దండనము తప్పదు వానికి నెవ్వరడ్డినన్॥

చ॥ అవి యటులుండనిమ్ము మన కా నృపధర్మ విచారమేల? నే
ను విభుఁడఁగాను మీరును గనుంగొన నన్యులుగారు నాకు; బాం
ధవులము మీరు మేము నిఁక దాపఁగనేల రహస్యమిట్లు బాం
ధవ మొనరింప నెంచియె ముదంబున వచ్చితి మార్యరత్నమా॥

ఉ॥ క్షత్రియ వైశ్యబాంధవమసంభవ మందురయేమొ బ్రాహ్మణ
క్షత్రియ వైశ్యులందు ద్విజశబ్దము సార్థకమౌటచేత మా
క్షత్రియులార్యవైశ్యకులజాతలఁ బెండిలియాడవచ్చు; మీ
పుత్రికనీయవచ్చు మముబోటి నృపాలకులావతంసుకున్

వ॥ అని విష్ణువర్ధనుండు పలికినంతనే యక్కడి పేరెక్కిన వైశ్యకుమారులందఱు ముక్కునవ్రేళ్ళిడుకొని యక్కజ మొందుచుండ, నక్కుసుమార్యుండును భాస్కరార్యుండును నిర్ఘాంతపడి పరస్పర ముఖావలోకనం బొనర్చుచుఁ గొంతోకవడి మాఱాడక యిన్నకుండ నుద్వాహకుల గోత్రపవిత్రుండగు కుసుమార్యుఁడు డిగ్గనఁ దనయాసనము నుండి లేచి, నృపాలున కెద్దియేని బ్రత్యుత్తరం బొసంగ నుద్యమించుటయు, భాస్కరార్యుండు వాని నివారించి, కూర్చుండఁజేసి, ముకుళిత కరకమలుండై యల్లన నాభూవల్లభున కిట్లనియె.

గీ॥ మనుజనాయక! నీవచించినది యెల్లఁ
గాదనఁగరాదు; నీయెఱుంగనిది లేదు
ధర్మములురెండు తెఱఁగులై ధరణిఁబరగు
శాస్త్ర సమ్మతమనఁగ నాచారమనఁగ॥

గీ॥ ఏపురాణాలయందు మఱెందుఁగూడ
వైశ్యకన్యను నృపుడు వివాహమాడి,
నట్టి చందమ్ము గన్పడ దంతెకాక,
యట్టి యాచార మీపురమందు లేదు॥

గీ॥ ఆర్యజనసమ్మతముగాని యట్టిపనికిఁ
దగవు తగములు తలఁపక తెగుటతగదు.
మఱియుక్షత్రియాన్వయకులాభరణమవయి
వైశ్య కన్యాభిలాష భూపాల! యేల?

గీ॥ అన్నిట నృపాలుఁడు స్వతంత్రుఁడైన కతనఁ
జేయుచుండును దోచిన చేతలెల్ల,
భయముననొభక్తినో వానిప్రజలుఁగూడ
నౌను గాదనకాతని ననుసరింత్రు॥

గీ॥ దేవ! నీవిధమ్మున స్వతంత్రించుటెల్ల
నన్యులకు సాధ్యమగునె కార్యములపట్ల
ననెడు గుఘమాటలకు నడ్డమగుచుఁ గుసుమ
వైశ్యరత్నమ్ము లేచి భూపాలుఁజూచి॥



ఉ॥ చక్కఁదనంబునందు గుణసంపదయందును విద్యలందుఁబెం
పెక్కిన సుందరాంగన లనేకులు మీకొలమందుఁగల్గ, మీ
రక్కట! యిట్లు కక్కురితి నందము చంపములేక సాటికిన్
దక్కువదైన వైశ్యవనితన్ వరియించుట పాడియే నృపా!

ఉ॥ సాటికులంబు వార లెకసక్కెములాడరె మిమ్ము మమ్మమా
బోటులఁ గోరరాదు తమబోఁటి నృపాలురు, కోరినంతనే
బోటుల నీయరాదు మముబోఁటులు; కోమటికన్నె యేడ, తా
మేటినృపాలశేఖరుని మెప్పువహించుటయేడ భూవరా!॥

గీ॥ అయిన మాభాగ్యవశమున నస్మదాత్మ
జాత మీవంటి ధారుణీనేత మెప్పు
వడసెగాన మాకొలమున వారితోడ
నేతదంశమ్ము కలిసి యూహింపవలయు॥

వ॥ అట్లు కావింపని నాఁడు కులమ్మునకెకాక లోకమ్మునకును నింద్యులమయ్యెదమని వచించి, నృపాలునొప్పించి, తదీయానుమతింగాంచి, భాస్కరార్య సమేతంబుగ సకల వైశ్యకుమారులతోడ నిజమందిరాభిముఖుండై పురంబునఁ బ్రవేశించి, మార్గమధ్యమ్మునన తక్కిన యక్కుమారుల కెల్లరకు రాత్రిభోజనానంతరంబునఁ దన యావాసమ్మున కేతేర నియోగించి, సెలవొసంగి, తానును భాస్కరార్యునితో నేకాంతంబుగఁ దదంశంబును గూర్చి ప్రసంగించుచు మెల్లన నిజమందిరంబునం బ్రవేశించుటయు

ఉ॥ రాజునకుంగుమార్తె నిడరాదనియో యిడవచ్చునంచునో
యోజన సేతురంట వణిజోత్తము లయ్యది యాలకించియా
యోజనమున్నదున్నటులె యొప్పుగనాకెఱిఁగింపుమంచు, రే
రాజునుబంపనేగె దినరాజపరాచలరాజసీమకున్॥

ఉ॥ క్రన్నన రాజురాక పెను గండముగాఁ బెనుగొండసీమవా
రెన్నుచునుండఁ దత్తనువులెంతయుఁ గంపమునొందుచుండ నా
వెన్నెలరేడుచొచ్చెవినువీధిని; నిఁతకుఁబుష్యమాసపున్
వెన్నెలలోభిసామ్మకిరణిన్ ధరణిన్ గడువ్యర్థమేకదా?

క॥ ఆనాటిరాత్రి భోజన
మైనంతవణిగ్జనమ్ము లక్కుసుమార్యా

నూనకన త్కనకసభా
స్థానసమాసీనులై ముదంబుననుండన్॥

॥ బంగరుజరీబుటాలహా
రంగున బంగారు కాశ్మీరపుశాల్వ శరీ
రాంగంబులఁ గప్పి వణి
క్పుంగవుఁ డేతెంచె నంత గురుపుంగవుతోన్॥

శా॥ అటులరుదెంచివాని నుచితాసన సీమనుదాత్తనుంచి, పి
మ్మట నిజపీఠ మెక్కి తనుమన్నన సేయఁగ నిల్చియున్న య
చ్చటిపరివారముం గరము సంజ్ఞలతో వసియింపఁ జేసి, వి
స్ఫుటవినయోక్తులన్ వణిజముఖ్యులఁ గాంచి వచించె నీక్రియన్॥

శా॥ ప్రాలేయాచలకన్యకా ఘనకృపాభాగ్యంబుచేఁ గన్నయ
బ్బాలారత్నము నిమ్మటంచు మనలన్ బ్రార్థించుచున్నాఁడు భూ
పాలుం డెల్లరెఱింగిరా తనివచో వ్యంగ్యార్థసారమ్ము నే
మాలోచించితి రో వణిక్ప్రముఖులారా! మీరు కర్తవ్యమున్॥

క॥ ఎవరెవరికెల్లు తోచునొ
వివరింపుఁడు గురునిమాటల విని తా షట్చా
స్త్రవిదుం డీషద్హాసియుఁ డై
చివరన్ గర్తవ్య మెదియొ స్థిరపఱచుఁ దగన్॥

చ॥ అనుటయు నందుఁ గల్గు వణిగగ్రణులందఱు నొండొరుంగనుం
గొనుచు నిమీలితాక్షులయి కొండొక సేపు తలంచి, పెద్దలే
మనెదరొ విన్నపై మనము నర్హగతిన్ వచియింత మంచుఁ దా
మనుకొని పిన్నపెద్దలొకపై మరు మాట వచింప రయ్యెడన్॥

సీ॥ మూతులు బిగియించి ముక్కులు నిక్కించి
వేడినిట్టూర్పులు విడుచువారు
చింతించి చింతించి చీకాకు వహియించి
కాసగోళ్లఁ దలగోకుకొనెడువారు,
ఊర్ధ్వదృష్టులతోడ యోచించి యోచించి
యందందుఁ గలవారి నరయువారు,



తలలు పంకించుచుఁ దమచెంతగలవారి
తోడ నేకాంతంబు లాడువారు।
నగుచు నే మాడుటకుఁ దోప కందుఁ గల్గు
సభ్యులటు లూరకుండఁ దత్సమయమందు,
నగసయశ్రేష్ఠియను వణిగ్వరుఁ డొకండు,
లేచి యప్పుడు కుసుమార్యుఁ జూచి పలికె॥

ఉ॥ ధారుణిపాలు నాజ్ఞ తలఁదాల్పక తప్పదు, కన్య కాతనిన్
గూరుచు టంత యుక్తమని కూడను దోపదు, పూర్వమిట్టి యా
చారము లేదు. పెద్దలెటు సల్పిన నాకదె యిష్టమంచు, ని
స్సారముగా వచింప విని సభ్యులు నవ్విరి పక్కపక్కనన్॥

ఉ॥ ఇంచుక సేపు వైశ్యసుతులెల్లరు నీగతి నవ్వులాడి, చా
లించి యొకొక్కఁడే తనస్ఫురించిన యూహ వచింపఁ జొచ్చెఁ గా
దంచును నౌనటంచు నొకరన్నది యింకొకరప్పుడే విమ
ర్శించుచుఁ బ్రస్తుతాంశమును జేర్చిరి మెల్లఁగ గాఢచర్చలోన్॥

చ॥ ఇదివరకెందు లేని పని యే మొనరింపమటంచు రేనికిన్
బదులిడరాదె యన్న నదిభావ్యము గాదని యొక్కఁ డాడు, మి
మ్మొదవరియింపఁ గంట జలజేక్షణ యంచు వచింత మన్నఁ దాఁ
గదలఁడు దాన రాజని యొకండను నౌనను నింక నొక్కఁడున్॥

ఉ॥ ఆతఁడు రాజు మీ సుత కనర్హుఁడె యంచు నొకండు వల్కు నీ
కూతును నిచ్చుకొమ్మనుచుఁ గోపముతోడ మఱొక్కఁ డాడు, నీ
రీతిగ నిద్రగప్పి కనురెప్పలకున్ బరువెక్కుదాక నా
రాతిరి వాదమాడు నెడఁ గ్రక్కున బాలకుఁ డొక్కఁ డిట్లనున్॥

చ॥ అనవసరంపు వాదముల నాడిన నేమి ఫలంబు? రాజుతో
ననుఁడు కుమార్తె నిత్తుమని యంత భుజంబులు పొంగి యాతఁడున్
జనుఁ దన పట్టణంబునకుఁ జల్లఁగఁ బిమ్మట నే తదంశమున్
గొని కడు సావకాశముగఁ గూడి విచారణ సేయుఁ డెల్లరున్॥

గీ॥ అనుటయును మేలు మేలని యందుఁ గల్గు
సభ్యులు నుతించి, రంత భాస్కరుఁడుఁ గూడ,

శిరమునూఁచెను గుసుమార్యవరుఁ డొకండె,
యులుకు పలుకును లేకుండ నుండె నపుడు॥

ఉ॥ మంచియుఁజెడ్డ వల్కకిటు మౌనముదాల్చితి వెందుచేత నీ
వంచుగురుండు వల్కఁగుసుమార్యుఁడు పల్కును బాలకుండు క
ల్పించిన యుక్తియుక్తమగు లేశము సందియముండ దైన నీ
వంచన యీయసత్యమును వైశ్యకులంబున నుండవచ్చునే?

ఉ॥ నా నతఁడిట్లనెన్ వణిజనాయక! ధర్మరహస్యముల్ వినం
గానవు వంచనమ్మనెకాక జయింతువె వంచకున్? సదా
ప్రాణము మానమున్ ధనము భంగము సెందెడువేళలన్ దదీ
యానృతదోషముండదని యాగమసూక్తి వచించునేసుమీ! ॥

వ॥ అని కొన్ని ధర్మసూక్ష్మంబు లెఱింగింప నవ్వణిజ నాయకుఁడును సభ్యులును నాతనిధర్మశాస్త్ర కౌశలమున కచ్చెరువొంది రేని ప్రమోదఁ బలుకాడు తెఱంగు కరంబూహించి, యంతతో సభ చాలించి తమతమ మందిరమ్ములకుంజని రమ్మఱునాడు మధ్యాహ్నమునయథావిధిగ నక్కుసుమవైశ్యుండుతగుపరివారముతో భాస్కరార్యపురస్కరముగ రాజదర్శనమునకుంజని యుచితగతి నమ్మహీపతిచే గౌరవింపఁబడి నయభయంబుల నాతనికిట్లనియె

ఉ॥ ఉల్లమునందు సంతసమునొందిరి వైశ్యకులంబు వారు నీ
వల్లుఁడవయ్యె దంచు వినినంతనెనిన్నటిరాత్రి, మేము భూ
వల్లభ! నీకు నిట్టిశుభవార్తను జెప్పఁగ నిశ్చయించినా
మెల్లరమంచుఁ బల్కఁగనరేంద్రుఁడు నిర్భర మోదచిత్తుఁడై॥

చ॥ అనుపమ సంభ్రమంబునను నంబర మందుకొనంగఁజొచ్చె నా
జనపతి, కాని తద్వచన చాతురి దాఁగహియింపఁడయ్యె నెం
దునుగడు దుర్మదాంధులకుఁ దోచునె మంచియుఁజెడ్డయున్ సుధీ
జనముల వాక్కులందుఁగల సారము కీర్త్యపకీర్తు లింతయేన్

గీ॥ క్రిందుమీదునుగాన కానందపడుచుఁ
దక్షిణమ మంత్రులనుజూచిధరణివిభుఁడు
ఘూరలిఁకలగ్ననిశ్చయ భారమూని,
మనపురోహితులను బిల్వఁబనుపుఁడనిన ॥



గీ॥ భాస్కరుండను దేవ! యీభారమెల్ల
మాదియేకాని మీయదికాదు లగ్న
నిశ్చయాధికారంబెల్ల నెలతనొసఁగు,
వారిదేయాట యిచటి యాచారమనఘ!॥

గీ॥ కన్యకాజన్మ నక్షత్రగతులఁబట్టి
మేమెసుముహూర్తమును నెంచినాము మీరు
తరలిరావలె శుభలేఖ లరసి నాటి
దినమునకటంచుఁ బల్కియిట్లనియె మఱియు॥

వ॥ దేవా! నేటికేకమాసావకాశంబగు మాఘశుద్ధవిదియా గురు వాసరంబునఁ బగలొక్కయామంబుపైఁ జంద్రతారా బలంబులు బలంబై యుండునని వచింప, నంతటికాలాతీతంబు తనకసహ్యంబయ్యు నక్కామాంధుండు విధిలేక సమ్మతించి, బంధుభ్రాంతి నవ్వైశ్య సందోహమ్మును నుచితాంబరా భరణాదుల గౌరవించి, నిజపుర ప్రయాణమ్మునకుఁ బరివారమ్మునకెల్ల సెలవొసంగి, తానునుం బయనంబై తన్ను సాగనంప నేఁటవచ్చు వైశ్యపరివారముతో వివాహవిషయికప్రసంగంబుగావించుచుమెల్లఁగ గౌతమీ తటంబు సమీపించి, యొక్క కుయుక్తి నెంచి, వైశ్యులఁగాంచి, మీరెల్లరుం దప్పక నాకచ్చంచరికాలక వాసవాంబ నొసంగునట్లు లియ్యఖండ గోదావరీ ప్రవాహగంగాముఖంబున మున్మారు ప్రమాణంబు సేయుండని నిర్బంధింపఁ జేయునదిలేక వారందరు నేకవాక్యముగ నమ్మహీరమణున కిట్లనిరి.

క॥ ఇచ్చెదము కన్యకామణి
నిచ్చెదమా వాసవాంబ నిది నిక్కము నీ
కిచ్చెద మటు లీకుండినఁ
జచ్చెదమో ధరణిపాల! సంశయమేలా?॥

గీ॥ అని ప్రమాణంబుచేసిన యార్యవైశ్య
జాతమునుమెచ్చి తనదారి సాగె నృపుడు
సపరివారమ్ముగా వైశ్యసత్తముఁడును,
మందగతిఁ బురోయాయియై మఱలెనంత॥

వ॥ అమ్మఱునాడె కుసుమార్యుండు భాస్కరోపదేశమున నేతద్వృత్తాంతంబు పత్రికామూలమునం దత్పుర పరిసరమ్మునంగల యష్టాదశవైశ్య పట్టణంబులం జాటించి

కులాభిమానమును మతగౌరవమును గల వైశ్యకుమారు లెల్లరు నవశ్యంబుగ విచ్చేయుండని యాహ్వానించిన నెన్నండు లేని యవ్విపరీత వృత్తాంతంబునకు వణిక్సత్తము లెల్లరుఁ జిత్తమ్ముల నుత్తలపాటు సెంది నాటి పుత్రకామసవనార్థమ్మునకుఁ బోలె దిన దినమ్మును వేలకొలందిగ నన్నగరంబునఁ గ్రిక్కిరియుటయు నిశ్చితవైవాహికశుభలగ్న దినంబునకు దశదినమాత్ర పరిమితంబగు నొక్కయాదిత్య వాసరంబున నప్పెనుగొండ నగరంబునందుఁ బ్రథమార్య వైశ్యమహాజనసభ కుసుమ శ్రేష్ఠియాధిపత్యంబునఁ గావింపంబడెనంత,

చ॥ ప్రతిదినమాగతిన్ జరుగు వైశ్యసభాంతర సీమలందువా
క్చతురతఁ జూపుచున్ వణిజసత్తములెందరొ యేతదంశమం
చితగతిఁ జర్చచేసి తమ శేముషిఁ జూపుచునుండిరైన, నం ద
ప్రతినిధులెల్ల రన్నిటఁ బరస్పరభిన్నమతస్థులౌటచేన్॥

ఉ॥ పర్యవసానమెప్పటికి వారలు తేల్పఁగఁ జాలకుంట, న
య్యార్యవణిక్కులోద్భవచయంబుల నమ్మ ద్విపక్షమయ్యె: ధీ
వర్యుఁడు రాజు కన్యనిడవచ్చు నటంచొక పక్షముల్ యశో
ధుర్యులు వైశ్యులట్లిడుట దూష్యమటంచు మఱొక్కపక్షముల్

ఉ॥ అంతటిరాజు తానయి స్వయమ్ముగఁ గన్యను గోరవచ్చినా
డెంతటిభాగ్య మెంతయశమియ్యది వైశ్యులకెల్ల నమ్మహీ
కాంతుని చెట్టఁబట్టి మనకన్నియ తానొక రాణియౌచు న
త్యంతమఖండవైభవము లందుటఁజూచి సహింపఁజాలరే?

చ॥ కులమున వైభవంబున నకుంఠిత తేజమునందుఁ గీర్తియం
దలఘుఁడు సాటిభూమి పతులందరఁ జేరుకలట్టివాఁడు, వై
శ్యుల కతఁడల్లుఁడౌట కడుఁ జోద్యము కన్నియనీయకున్నచోఁ
దెలియునునాడె మీకతని తీవ్రపరాక్రమధైర్యసంపదల్॥

ఉ॥ ఆతఁడు వైశ్యపట్టణములన్ని దహించియు నివ్వణిగ్జన
వ్రాతము నెల్లఁగూల్చి మనవంశము పేరయినన్ మిగుల్చునే?
భూతలనాథుతోఁడ గవిపుంగవుతోఁడ విరోధమూని యే
ధాతయునెగ్గలేఁడు పెడదారినిదొ్రక్కి నశింతురే కటా! ॥

క॥ అని మొదటిపక్షమునవా
రనుదినము నుపన్యసింప నాయాయుక్తుల్



విని ఖండించిరి యీవిధ
మునననందలియన్యపక్షమునఁ గలవారల్॥

ఉ॥ ఎంతటిరాజుతానయిన నెంతయశమ్మును గన్ననేమి? భూ
కాంతుని రాణికానియెడఁ గన్యకులోపముకల్గునే? పురా
ణాంతరగాథలన్ బహుకులాంగనలున్న నృపాలకోటి వృ
త్తాంతము లెల్లవింటిమి వృథాశ్రమ రాజులమెచ్చ నేటికిన్?

చ॥ కులమున కెక్కుడైనను నకుంఠిత తేజ మదెంతయున్న, వై
శ్యులఁ దెగటార్చినన్ గులము శూన్యము చేసిన పట్టణమ్ము లా
ఖులుఁడు దహించినన్ మనకుఁ గన్యనొసఁగుట నీతిగాదు, కాఁ
గలదొఁకఁగాక పోదు, కులగౌరవమెయ్యెడ నిల్పఁగావలెన్॥

గీ॥ కొంపలనుగాల్చు వైశ్యులఁగూల్చుఁ గులము
శూన్యమొనరించు నేకాని సుంతయైన,
వైశ్యకులగౌరవము మాప వానితరమె
యదియె నిల్పెద మేది యొల్లైనఁగాని॥

గీ॥ ప్రతిదినమ్మట్లు రెండు తెఱఁగులవారు
వాదమాడుచు నెన్మిదివాసరములు
గడప మఱునాటిసభ మొదలిడినయంత
నార్య వైశ్యుల కక్కుసుమార్యుఁడనియె॥

గీ॥ వట్టివాదమ్ములను నింకఁగట్టిపెట్టి
నేఁడు పర్యవసానమ్ము నిశ్చయించి
పదియవదినమ్ము పంపింపవలయు రేపు
రాయబారులఁ గొందఱి రాజుకడకు॥

వ॥ అను నగ్రాసనాధిపతిప్రారంభ వాక్యములతోఁడ నాటిసభావ్యవహారం బారంభమగుటయుఁ దత్సుందర సభామందిరం బలంకరించిన చతుర్దశోత్తరసప్తశతగోత్రస్థులలో నేబది గోత్రంబుల వారు లేచి

ఉ॥ రాజులు చంచలాత్ములు స్థిరంబుగ నుండవు వారికోర్కె లా
రాజమహేంద్రరాజు నిజరాజనిభాస్యలఁగూడి యివ్వణి
గ్రాజనిభాస్యసంగతి తలంపుననుంచునె యుంచునేని, నూ
రోజనమంత మోహమును నుండునె యిప్పటిదాక వానికిన్॥

క॥ ధనకనకవస్తు వాహాన
ఘనమణి హారాదులెల్లఁగానుకలు గొని యో

యనఘా! కన్యకు బదులుగఁ
గొనుమనిన ధనాశనతఁడు గొనునని తోఁచున్॥

ఉ॥ గోటనుజీరు దానినిటు గొడ్డటఁ జీరఁగనేల యుక్తిగా
మాటలనాడి యానృపుని మానసమున్ మఱలింపవచ్చు ము
మ్మాటికి, కన్యకన్ విడచి మాకులధర్మము నిల్పెదేని యే
ఏటను గాన్కలీకరణి నిచ్చెదమన్న నతండు మేలనున్॥

క॥ అనిపల్కిన నయ్యుక్తిని
విని యెల్లరు సంతసించి వేనోళ్ళను వా
రిని గొనియాడుటెగా కా
పని వారలయందె పెట్టి పంపెదు కోర్కెన్

క॥ చతురమతులు మీరేనర
పతికడకుంబోయి యుచితభంగిని మీవా
క్చతురత లెల్లను జూపుచుఁ
బతినొప్పింపుండటంచుఁ బ్రార్థింపంగన్॥

క॥ ధాత్రీశున కర్పింపఁగఁ
బాత్రములగు కాన్కలూని బ్రాహ్మణవిజయ
స్తోత్రంబుల నయ్యేబది
గోత్రంబులవారుఁ జనిరకుంఠితదీక్షన్॥

వ॥ అని యక్కథకుండెఱింగింపఁ దదనంతరకథావిధానంబమ్మహర్షిమండలంబు వినంగోరుటయు,

క॥ సకలామర హేమాంచిత
మకుటాగ్రస్థగితరుచిర మాణిక్యవిభా
నికరవిరాజిత మృదుచర
ణకమలయుగళా! శ్రితావనక్షమశీలా॥

గద్య

ఇది శ్రీమద్భోగరాజవంశ పయఃపారావార రాకాసుధాకర రామయా
మాత్యపౌత్ర బాలాప్రసాదతనూభవ శ్రీవిజయనగర మహారా
జాస్థానకవిపదధౌరేయ నారాయణమూర్తినామధేయ
ప్రణీతంబైన కన్యకావిజయంబనుమహాప్రబంధం
బునందు ద్వితీయాశ్వాసము

---



శ్రీ

# కన్యకావిజయము

---

## తృతీయాశ్వాసము

---

క॥ అంబా! యగణితసుగుణక
దంబ! నమత్సర్వజనవితానాంచిత క
ల్పంబా! వదన విజితశశి
బింబా! వినవమ్మయవలి వృత్తాంతంబున్॥

సూతుండు శౌనకాదులకిట్లనియె.

శా॥ రోజున్ రోజును మన్మథార్తుఁడయి ధూర్తుండైన భూనేతవి
భ్రాజద్భోగవిరక్తితో సకలకార్యంబుల్ విసర్జించి యా
రోజుల్ గండము లట్లుపుచ్చఁ బలుమారుల్ వైశ్యరాకానిశా
రాజాస్యన్ గడుఁ బల్వరించుచు శరీరంబెల్లశుష్కింపఁగన్॥

ఉ॥ ఆపెనుగొండనుండి వణిగగ్రణులెవ్వరోవచ్చిరన్న ప
ల్కు పుడమీశుకర్ణయుగమందు సుధాకణపంక్తిగాఁగ సం
తాపముకొంతమాని యుచితక్రియ వారల గౌరవించి కాం
తాపరతంత్రుఁడైన నరనాథుఁడు నాటి సభాంతరంబునన్॥

క॥ ఉచితాసనములపయి నా
సుచరితుల వసింపఁజేసి సురుచిరమణి స
ఖచితాసనమును దాఁగొని
సచివులు బాంధవులు హితులు సఖులున్ గొల్వన్॥

క॥ మీకా కెల్లరకును క్షేమం
బే కద? మామామగారి కెంతయుఁ గుశలం
బే కద? నాహృదయేశ్వరి
కే కాలమునందు భద్రమే కద చెప్పుఁడా

చ॥ నగరమలంకరించితిరె నల్వురు బంధులు వచ్చినారె? సొం
పుగ సకలప్రయత్నములు పూర్ణముగాఁ గొనసాగెనే కదా?
తగినవిధాన నల్లునకుఁ దాఁ గుసుమార్యుఁడు కట్నమే మొసం
గఁగఁ దలపోసె నాకు వినఁగౌతుకమయ్యె నెఱుంగఁజేయుఁడీ

వ॥ అని ముసిముసి నవ్వులునవ్వి యాధరాధిపుండు వెండియు

ఉ॥ నవ్వులకన్న మాటలు మనంబున వేరుగ నెన్నఁబోకుఁడా
జవ్వని యాసురూప గుణసన్నుతలక్షణకన్నఁ గట్నమే
మివ్వఁగలండతండు ముదమెయ్యది యంతకుమించి మాకు- మా
కవ్వనితాకరగ్రహణ మా సురరాజ్యపదాధికంబగున్॥

చ॥ అనుపమమామదీయ సుగుణాంచితరూపకలావిశేషముల్
మనసుననాటి వాసవ కుమారిక్షణంబు యుగంబుగాఁగఁ దా
దినములు పుచ్చునే కద? ప్రతిక్షణముల్ మముఁ జూచుచుండు నా
కనదలినీలకుంతలను గానఁగ నేగుట కల్గ నేటికిన్॥

వ॥ వైవాహికప్రయాణంబు సన్నాహంబు సర్వంబు సంసిద్ధం బయ్యె సుముహూర్తంబున నేఁడెకా పెండ్లికిం దరలుటయని యక్కువలయేశ్వరుండవ్వైశ్యకులశేఖరులం బలుచందమ్ములు ప్రశ్నించుచుండ నచ్చటి యేబదిగోత్రంబుల కోమటులం గడుమేటి యైన కోటీశ్వరశ్రేష్ఠి స్వీయజనానుజ్ఞాతుండై ముకుళితకరకమలుండై యల్లన లేచి భూవల్లభుం జూచి

శా॥ దేవా! దేవర సర్వశాస్త్రహితనీతిస్ఫారపారీణు లా
ర్యావిశ్వేశ్వరభక్తశేఖరులు, విద్యాప్రౌఢులా మీఁద బా
రావారావృతమేదినీవలయసామ్రాజ్యాధినాథుల్ మహా
ధీవిజ్ఞానులు ధర్మమర్మములు గుర్తింపన్ సమర్థుల్ కదా? ॥

క॥ నావిష్ణుః పృథివీపతి
నావినియెదమయ్యా! భూమినాథుఁడె ప్రజకున్



దేవుఁడు కష్టసుఖంబులు
భావించెడువాఁడు నార్తిఁ బాపెడువాఁడున్॥

మ॥ తనసంతానమునట్లు సర్వజనసంతానమ్ములన్ న్యాయశీ
లను బాలించు నృపాలకుం డిహపరశ్లాఘార్హుఁ డౌఁ బూజ్యుఁ డౌ
జననాథావళి మంచిచెడ్డలు కథాజాలంబులన్నేటికిన్,
వినుచున్నారముకా నృపాలక! జనుల్ వేనోళ్లఁ బల్కాడుటల్॥

చ॥ స్వజనమహానురాగమును శాశ్వతకీర్తినిబొందఁగోరి భూ
భుజుఁడు వృథాప్రయాసంబులు పోకలు పోవుచునుండుఁగాని, త
త్ప్రజలసనాతనంపుఁ గులధర్మములన్ దగఁ బ్రోచుటొక్కటే
నిజమగు సూక్ష్మమార్గమను నీతిరహస్యమెఱుంగఁడో నృపా! ॥

గీ॥ స్వజనకులధర్మరక్షణ జరుపకున్న
నితరధర్మంబులెన్నైన నేల పతికి?
భర్తృసేవావ్రతమ్మును బడయకున్న
నింకవ్రతములవెన్నైన నేల సతికి? ॥

గీ॥ నేటితెనుఁగుసీమను దమబోటిమేటి
జనపతులు ధర్మ[illegible]దుల సాటివారు,
ప్రజలకులధర్మగతులఁ గాపాడువారు
లేరు లేరు ముమ్మాటికి లేరు భూప! ॥

ఉ॥ మాకులగౌరవమ్ము మఱి మాకులశీల మనేకభూవరా
నీకముచే నుతింపఁబడి నేటికి నొక్కగతిన్ జెలంగెడున్,
మీకృపచేత నింక నిటమీఁదనుగూడ సనాతనాగత
ప్రాకటవైశ్యధర్మ మొకభంగముఁ జెందక యుండుఁగావుతన్॥

ఉ॥ మమ్ముఁ బరీక్ష సేయుటయొ మాదురదృష్టమొ మా కుమారపా
పమ్మొ మరేమి కారణమొ వాసవకన్యకపైని నిట్లు మో
హమ్ముదయించె మీకు నదియాదిగ మా పెనుగొండవారు చి
త్తమ్ములఁ దల్లడిల్లెదరు తామరపాకున నీటిబొట్టులై॥

ఉ॥ కాంచనగాత్రి నిచ్చునటు గౌతమియొద్ద ఖరారు మీరు చే
యించినదాదిగాఁగఁ బదునెన్మిదికోమటిపేటలొక్కటై

వంచినమోమునెత్త కెటువంటియవస్థ విరించి మాకుఁగ
ల్పించెనటంచు నూరకటు వేదురుపొందుదు రో నరేశ్వరా!
ఉ॥ పెద్దలమాట కేమి పృథివీవర! పిన్నలుఁగూడ దీనికిన్,
దద్దయుదుఃఖసాగరమునన్ దరిగానకపోక్కుచుండ్రు మా
ముద్దులవాసవాంబయును మోమున నెత్తురుచుక్క లేకయే
ప్రొద్దును నీరునన్నమునుముట్టక యేడ్చు నృపాలశేఖరా! ॥
సీ॥ తత్ప్రసంగ మొనర్చు తఱిఁ జంటి పాపలున్
దల్లుల చనుబాలు ద్రావరన్న
లేశమ్ముఁ బాలీవు లేగలం గుడుపవు
మాయిండ్ల నావులు మేయవన్న
కులధర్మమను పల్కు వెలిచేసి మాయింటి
చిలుకలే పలుకులుఁ బలుకవన్న
వాడవాడలయందు వాసవాంబాప్రసం
గంబకాని మఱొండు గానమన్న
వేయియేటికిఁ బెనుగొండ రేయిబవలు
నట్టుడికి నట్టుడుకుచున్నదన్న! నీవ
కారణంబన్న యింతటి దారుణంబు
మానుమోయన్న దయఁజూపి మనుపుమన్న
చ॥ కరుణవహింపుమన్న! తమగాదిలి బిడ్డలమన్న! మాపయిం
గొరకొరలేటికన్న! శ్రితకోటిపయిం బగ గూడదన్న! యీ
వరకిటువంటి దుస్థితిని వైశ్యకుమారు లెఱుంగరన్న! దు
ర్భరమగు మావిషాదమును బాపఁగదన్న! నరేంద్ర చంద్రమా!
ఉ॥ హాటకరత్న సంచయ సమంచిత భూషణపంక్తిఁ దెచ్చి మా
బోటికి మారుగాఁగ నృపపుంగవ! యర్పణ చేసికొందు మే
లాటను బన్నగాఁ గృపవహించి వణిక్కుల ధర్మమింతయున్
జేటువహింపకుండునటు సేయుఁడు పాయుఁడు మీతలంపులన్!
ఉ॥ మానవతీశిరోమణి, యమాయకురాలు మహాపవిత్ర స
న్మానచరిత్ర వాసవకుమారిని బేర్మినిఁ గన్నతల్లి; యా



చానత్వదీయ పాదజలజంబులు మ్రొక్కుచుఁ జెప్పుమంచు నో
మానవనాథ! చెప్పెనొకమాట కృపామతి నాలకింపుమా!
ఉ॥ అన్నలులేరునాకు వసుధాధిప! తమ్ములెకాని, నీవెమా
యన్నవు నేను జెల్లెలను నన్నలు చెల్లెలి నీవిధంబునన్
బన్నము పాలుసేయుదురె? వైశ్యులయింటను నాడుబిడ్డనై
యెన్నఁడెఱుంగ నిట్టివగ పిట్టియవస్థయు నీవిచారమున్
చ॥ కటకట! యాఁడుబిడ్డ నిటు కారియ వెట్టుచునుండునట్టి య
క్కుటిలున కెందు శ్రేయమొనఁగూడదు, నిల్వదు తత్కులంబు కో
మటులతి సాధుశీలురు నమాయకులౌదురు, సాధుబాధ నీ
కిటుతగునయ్య! నీవు సుఖయింపవటయ్య! చిరాయురున్నతిన్
ఉ॥ దేవకి కన్నకూఁతు మెడ తీవ్రతరాసిని గోయనెంచి నా
డావిధిఁ గంసధూర్తుఁ డిపుడట్టులె పచ్చని త్రాడుతోడ ధా
త్రీవర! నాదుకూఁతుమెడఁ ద్రెంపఁగ నెంచితివీవుఁగూడ నే
దైవమునీకుఁ దోడ్పడఁడు తథ్యముమాను మధర్మవాంఛలన్॥
ఉ॥ వాసవకన్య లోకమున వైశ్యకుమార్తెలవంటి దంచు నీ
వాసవహింపఁబోకుము మహానలకుండమునందుమాసతీ
దేవి ప్రసన్నయై సవనదీక్షకు మెచ్చి యొసంగినట్టి స
త్పావనజన్మ యామెయెడఁ బాపపుఁజింత త్యజింపుమా నృపా!॥
మ॥ జననంబందినదాది యవ్వికచకంజాతాస్య సాక్షాత్కరిం
చిన కాత్యాయనియంచు మాకులమునన్ జింతించి పూజింత్రు మా
తనయం గోరుట లోకమాత నగజాతం గోరుటౌ వంశవ
ర్ధనముం గోరిన నిట్టి లోకవిపరీతభ్రాంతి వర్జింపుమా॥
గీ॥ అనివచించినవణిజువాక్యముల నాల
కించి నంతన మూర్తి భవించినట్టి ।
ప్రళయశిఖివోలె విష్ణువర్ధనుఁడు మిగుల
మండిపడుచు నొకింతయు మాట లేక॥
చ॥ పెటపెటపండ్లు గీటివటు భీకరమూర్తి వహించి కన్నులన్
భాటపాటనిప్పులొల్కఁ బెనుభూతము పట్టినవాని పోల్కి న

చ్చటి నిజసభ్యకోటికి విచారముగూర్చి వికారచేష్టలన్।
బటుతరమోహమగ్నఁ జెవిఁబట్టునె నీతిహితార్థజాలముల్॥

ఉ॥ మీరినకోపభారమున మేలిది కీడిదియంచుఁ బల్కలే
కూరక గద్దెపై యరచుచుండెను రాక్షసపాత్రవోలె ధా
త్రీరమణుండు; మంత్రులు తదీయ మహాగ్రహ శాంతివాక్యముల్
నేరిమిమీరఁబల్కి ధరణీపతితోడ వచించిరీగతిన్॥

వ॥ దేవా! దేవరయాగ్రహంబున కిదితరుణంబుగాదు ; కన్యామణి నీమనినంత మాత్రమున నివ్వైశ్యులం బయిపయింబోనిత్తుమె? ఇక్కోమటులు పలుచదువులు చదివిన గఱువలతెఱంగున మనకెంతయు భ్రాంతి గొలుపుచున్నారు. శాస్త్రపఠాహ్యంబైన కర్జంబు మనకును వర్జనీయంబుగాన క్షత్రియ వైశ్య సంబంధంబసంభవంబని శాస్త్ర ప్రమాణంబున వీరు సిద్ధాంతమునర్తురేని, యవశ్యంబుగ మనయత్నమ్ము పరిత్యజింత మట్లుకాక శుష్కాలాపంబుల మనలంగన్నుగ్రామి పోనెంచునెడ వీరలం గారాగారాంతర నిబద్ధులంగావించి క్రమప్రకారమ్మున నవ్వాసవాంగనను గ్రహింపవచ్చుంగావున మామాయొనర్చు శాస్త్రహితార్థజాల వితర్కంబు దేవర సావధానముగ నవధరింతురు గాక యనిపలికి రేనియంగీకారమ్ము వడసి, సభ్యులెల్లరును దద్వివాదశ్రవణ కుతూహలమ్మున ముందులకుజరిగి హస్తనేత్రభ్రూయుగంబుల నెగయించుచుఁ దమకుఁబ్రోత్సాహంబు గల్పింప నమ్మంత్రిశేఖరులు వైశ్యుల కభిముఖులై వాక్యోపవాక్యంబుల నిట్లు ప్రసంగింపఁగడంగిరి.

ప్రశ్నోత్తర గీతమాలిక.

మంత్రు—వైశ్యవరులార! పెనుగొండవాసులార!
విష్ణువర్ధనధారుణీవిభుని మంత్రి
రత్నములు మిమ్మునడుగు ప్రశ్నమ్ములకును
దగిన ప్రత్యుత్తరములిచ్చి తావకీన
పాండితీవిశేషమ్మును బ్రకటపరపు॥

వైశ్య—డెంతపండితుఁడైనను నేమియడుగు,
వానికెందైనఁ జెప్పెడువాఁడుమిగుల
లోకువయటంచుఁ గలదొక్కలోకనీతి,
యైనఁగన్నంత చెప్పెదమడుగుఁడయ్య! ॥



మంత్రు—ప్రస్తుతాంశంబువాదించుపట్టునందు,
శాస్త్రమా! యుక్తియా? యేదిసాధనముగఁ
గొనియెదరో! తొల్తఁజెప్పుఁడో వణిజులార! ॥

వైశ్య—యుక్తికిని శాస్త్రమునకు నన్యోన్యమైన
గాఢసంబంధమున్నదిగాన శాస్త్ర
రహితమగు యుక్తియును యుక్తిరహితమైన
శాస్త్రమును వన్నెకెక్కవు సభలఁగాన
రెండుమావాదములయందు నుండునయ్య!

మంత్రు—ధర్మమనుమాట మీరుభూధవుని యెదుటఁ
దలుచుగా నుగ్గడించిరి. ధర్మమనఁగ,
నెట్టిదియొ యెన్నివిధములో మొట్టమొదట,
వ్యక్తపరుపంగఁగలరయ్య! వణిజులార! ॥

వైశ్య—శాస్త్రసమ్మతములు వేదసమ్మతములు
శిష్టసమ్మతములునై విశిష్టగతిని
ధర్మములు మూడువిధములై ధరణిఁబరగు॥

మంత్రు—త్రివిధధర్మంబులందును దేనికొదవు
నధికమైనప్రచార మియ్యవనియందు
నిదిసకారణముగ వచియింపుఁడయ్య!

వైశ్య—ముఖ్యముగ జనసామాన్యమునకు వేద
ధర్మమార్గ మసాధ్యమైతనరు; శాస్త్ర
ధర్మమోయన్న భిన్నమతమ్ములూని,
యొక్కొకయుగంబునందును నొక్కొకగతి,
మార్పుఁజెందును శిష్టధర్మంబొకండె,
సర్వజనసూక్ష్మమార్గమై జగతినెసఁగి
యధికమైన ప్రచారంబునందుచుండు.

మంత్రు—ధర్మమునుగూర్చి మీరలందరును నేర్చు
కొనిన దింతతోసరియొ యింకనువచింపఁ
దగినవున్నవా? యున్నచోఁ ద్వరగఁజెప్పుఁడు॥

వైశ్య — ఉన్నవెన్నైన నవకాశమున్నయెడల,
ధర్మము మహాసముద్రము దానినిపుడు
తఱచ శక్యమె? యైనను మఱియు నొకర
హాస్యమున్నది యాలింపుఁడయ్య! ధర్మ
మనఁగ నియమంబు; నియమ మెందైన భంగ
పడుటయే ధర్మభంగంబు; స్వనియమమును
దప్పక చరింపఁగల్గు టీధర్మసరణి॥
నియమరహితుఁడౌ మనుజుండె నిశ్చయముగ
ధర్మరహితుండు; విబుధసంతతికినెల్ల,
నొక్కనియమంబె యెన్నఁడునుండదయ్య!
ఒక్కొకని కొక్కొక విధాన నొప్పుఁగాన
నొకరి నియమమ్ము వేరొక్కరూనవలయు
నన్ననిర్బంధముండదో యన్నలార!
పరులనియమమ్మునకు భంగపాటుగూర్చి
తనదు నియమంబుఁ బూనసందఱిని మిగుల
బాధపెట్టెడు ఖలుఁడిహపరములకును,
దూరుఁడై దురాచారుఁడై క్రూరుఁడైన
శించు నపకీర్తి గాంచు దుఃఖించుఁగడకు॥

మంత్రు — రాజులకు వైశ్యకన్య నీరాదటన్న
నియమ మెంతకాలమునుండి నెగడుమీకు,
మానృపాలుని వలెనె మిమ్మేనృపాలుఁ
డిట్లు కన్యకనడుగ మీరిట్టి నియమ
మేర్పరచుకొనిరో సాక్ష్య మేర్పడంగ,
రుజువు సేయంగఁగలరె భూభుజుని యెదుట

వైశ్య — మీనృపాలుని కరణి మమ్మేనృపాలుఁ
డెన్నఁడును గన్యనిమ్మనఁ డీవిధానఁ
జరుగలేదెన్నఁడిటువంటి సాహసంబు॥



మంత్రు — జరుగకున్న నీనియమ మేర్పరచుకొనుట
కేమి హేతువొ? యాధార మేమిలేక
పలుకు మీపల్కు లెటు నమ్మఁగలరు బుధులు?

వైశ్య — పలుతరంబులనుండి మాకులమునందు
క్షత్రియున కొక్కనికినైనఁ బుత్రికనిడి
పెండ్లిసేయుటయే సంభవింపలేదు
కాన నిదియె యాధారంబుగాఁగ మాకు
ధర్మమేర్పడె మంత్రిసత్తమ్ములార!॥

మంత్రు — ఇది యధర్మంబె యైన మీరేల తొలుతఁ
గన్యనొసఁగెదమనుచు భూకాంతుతోడఁ
జెప్పినారయ్య? యిటు కేళిసేతురయ్య?

వైశ్య — బాలికల ముద్దులాడెడు వేళలందు ।
మీకుమార్తె నొసంగరే మాకటంచుఁ
దల్లిదండ్రులనడుగుట తప్పకుండఁ
గైకొనుఁడటంచు వారంట లోకసహజ
మట్టి పల్కులు నిజములె యయ్య యెందు?

మంత్రు — ఇట్టి కోమటియుక్తులు గట్టిపెట్టుఁ
డెందు లేనట్టి యాచారమేని మీరు
తొలుతనే వెల్లడింపఁగవలయుఁగాని,
లగ్ననిశ్చయమొనరించి, లక్షలైన
వ్యయము సేయించి, యిటుమాటవరుసకంటి
మనివచించుట భూపాలునందుఁ గల్గు
నట్టి నిర్లక్ష్యమే కాక యిట్టిఘోర
మెందునుండునె యూహింపుఁడించుకంత॥

వైశ్య — రాజచంద్రుని యందు నిర్లక్ష్యభావ
మించుకయు లేదు కన్యకనిచ్చువారె
యనిన నిచ్చెదమంటి; మట్లైనఁ బరిణ

యంబదేపుడన్న మాఘమాసంబు నంద
టంచుఁ బల్కితి మింతలో నంతధనము
వ్యయమొనర్చుట యాశ్చర్యమగుఁగదయ్య!
ఇంతయేటికి వ్యయమైన దెంతయైన
సెలవయిన మేమె భరియింపఁ గలముగాని
పణయము మాత్రమటు స్థిరపడఁగ లేదు,
స్థిరపడిన యెడ గౌతమీతీరమందు,
నేటికిఁ బ్రమాణమట్లు చేయించు విభుఁడు?
ఇచ్ఛేదమొ యీమొయని సంశయించి కాదె?
సంశయగ్రస్తమైన యంశమునుగూర్చి
వేలులక్షలు వెచ్చింపఁ బోలునయ్య?

మంత్రి—ఏల వెచ్చింపరాదు మీరెల్ల గౌత
మీ సమీపంబునందటు చేసినట్టి
యాప్రమాణంబుఁ బట్టి వైశ్యప్రవరు ల
సత్యమాడరటన్న విశ్వాసమూని
తత్ప్రయత్నమందుంటి మింతవరకేము,
ఎట్టి ఘోర ప్రమాణమ్ము లేని యిట్లు
మాటవరుసగాఁ జెల్లుఁ గోమటులకన్న
మాట తెలిసినదయ్య యీనాటమాకు॥

వైశ్య—మమ్మెఱుంగక మీరాడు మాటకేము
కలఁగనేల? ప్రమాణమ్మె కాదు వినుఁడు
మాటవరుసకు నన్నట్టి మాటయేని,
నోటవెడలిన నద్దాని దాటిపోవఁ
డార్యవైశ్యకులుండు; మీయధిపునెడఁ బ్ర
మాణమును మేమొనర్చిన మాటనిజము;
యీప్రమాణంబునందుఁ బ్రత్యక్షరమును
జరిపితీరెద మేటికి సంశయంబు?



మంత్రి—తనయ నీమందురొకమారు తప్పకుండ
నన్నయట్టులె కావింతు మందురొక్క
'మారు; మతిలేని మాటలుమాని, తెల్పుఁ
డన్నయదియేమొ? చేయఁగనున్న దేమొ?॥

వైశ్య— మంచిమతితోడమీర లూహించిరేని
మతిరహితములు కావుమా మాటలెల్ల!
అన్నదియు మేము గావింప నున్నదియును
గడకునొక్కటియే కాని కావు రెండు;
ఇచ్ఛేదము కన్యకామణి నీయకున్నఁ
జచ్ఛేదమని ప్రమాణమ్ము సలిపినాము;
ఇచ్చుటయధర్మమాట పృథ్వీశ్వరుని క్ష
మింపఁగోరితిమటు క్షమియింపఁడేని
చచ్ఛేదమువానిచేతిలో సంశయమ్మ,
లేదు, మఱియొండుజరుగదు లేశమైన॥

మ॥ అనినన్ భీకరమూర్తియై నరవిభుండవ్వైశ్యరత్నంబులన్
గనియోమూఢమనస్కులార! తొలుతన్ గన్యన్ సమర్పింతుమం
చనినమ్మించి వృథాప్రయాస లిడికట్టా! యిట్లుమోసమ్ము చే
సిన మీనాల్కల వాలునన్ దరిగినన్ జేకూరదే పాపముల్॥

శా॥ కారాగారమునందు మిమ్మునిపుడే కట్టింతు గిట్టింతు నా
నారీరత్నమునీయరే నఖిల సేనావారముంగూర్చి మా
వీరశ్రేణిని వెంటఁబెట్టుకొని మీ వీటంబ్రవేశించి కాం,
తారంబందునఁ జొచ్చుచిచ్చుగతి విధ్వంసంబుఁగావించెదన్॥

ఉ॥ దక్షునియాగమందు సముదగ్రతఁజొచ్చిన వీరభద్రున
ట్లక్షయ మత్ప్రతాప విపులానల కీలలఁగాల్చికాల్చి వం
శక్షయమాచరించునెడ సంగరభూమిని మీకుఁదోడుగా
దక్షుఁడెవండు సన్నిదురు తాకఁగలాఁడు నృపాలకోటిలోన్॥

మ॥ పురముల్ వాడలు మేడలున్ నగరులున్ భూముల్ ఘనారామముల్
వరుసన్ మంటనిగల్పి వృద్ధులును బాపల్ స్త్రీలనంబోక గో

చరమా కోమటిపుర్వు నెల్లవిడకేచండాసిఁజెండాడెదన్,
కరుణంజూపక వైశ్యవంశకదళీ కాంతారముద్యద్గతిన్॥
వ॥ అనితనయమాత్యుల దిక్కుమొగంబై
చ॥ ఖలులఁగృతాపరాధులను గల్మషచిత్తుల నీవశిక్కులన్
జలమునఁబట్టి కట్టిచెరసాలను బెట్టుఁడు మండునెండలో
మలమలమాడునల్లులటుమాడిచి లేశము దాహశాంతికిన్
జలములనైన నీయకటఁ జావఁగనిండు కృపావిహీనతన్॥
శా॥ సేనావారము సంగరమ్మునకు సంసిద్ధంబుగావింపుమ
త్సేనానాథులకెల్లఁ జెప్పుఁడిఁక; నేతేరన్ వలెన్ మీరునా
తోనీసంగరయాత్రకున్ వ్యవధియెంతో గల్గ దెల్లుండియే
యేనేగన్ గృతనిశ్చయుండనయినా నీదండయాత్రార్థమై॥
వ॥ అనిడిగ్గనగద్దియండిగ్గి నిజాంతర్భవనంబునకుం బోవం బోవునభూవల్లభునకుఁ దన్మంత్రివర్గం బడ్డంబైనీతిహితవాక్యములనిట్లనియె.
క॥ కట్టించినఁజెరయందున్
బెట్టించినలాభమేమి పృథివీవర! మీ,
యట్టిమహామతియుతులును
నిట్టులఁద్వరపడియొనర్తురే కార్యంబుల్
క॥ వినతంబగు తృణవితతిన్
ఘనతర తరునికరమట్లు కడతేర్పఁబ్రభం
జనుఁడువిజృంభించునె? నే
రనిపిచ్చుక నేతురయ్య బ్రహ్మాస్త్రమునన్?॥
క॥ ఈకోమటులెటులోర్తురు
మీకోపోద్దీపితాగ్ని? మేమెల్లరమున్
మీకార్యముసాధించెద
మేకరణినినైన నోమహీవరతిలకా!॥
క॥ చెరబెట్టకవిడిచినతమ
పురికిన్ జని యిచటి విషయములు తమవారం



దరతోఁ బరికించెదరట
పరికించినఁ జూడవచ్చుఁ బైసంగతులన్॥
క॥ వీరల నిటు బంధించిన
వీరలవారెల్ల రిచటి విషయములెరుగ
న్నేరక తమకార్యము నెర
వేరెనకాతలఁచి విఱ్ఱవీగెద రధిపా!॥
వ॥ అని యిట్లు వివిధవిధంబుల సాధకబాధకంబుల బోధింప నమ్మహీధవుండును దంతపటపటారావపూర్వకంబుగఁ బొండు పొండని తిరస్కరించి పంచిన నావైశ్యులు బెబ్బులి బారికిం దప్పిన హరిణశాబకంబుల తెరంగునంగొల్వుకూటమ్ముఁ బాసినంతఁ గమ్మరనమ్మంత్రివరులును వారింజేరంజీరి నయభయంబుల హితోపదేశంబులు పెక్కులుపదేశింపఁ దగిన ప్రత్యుత్తరమ్ము లొసఁగి మండలేశ్వరుని దండయాత్ర నిక్కంబని గ్రహించి పయనంబై కతిపయదినంబులకుఁ బెనుగొండం బ్రవేశించుటయు
చ॥ వెడలినవారు వచ్చిరని వీనులఁ జేరిన మాత్ర నాతురం
పడుచును గుంపులై సకలవైశ్యకుమారులు వారిచెంతకున్
గడువడి నేగి చన్నపని కాయయొ పండొ యెఱుంగఁ బల్కుఁడం
చడుగఁ గడంగినారు పురమందలి వారలు వారినందఱన్
క॥ వరుసగవచ్చిన వారికి
జరిగిన క్రమమెల్లఁ దెలుపఁజాలక వార
మ్మరునాడుదయమ్మున సభ
జరిపిరి తద్విషయములను జర్చింపంగన్॥
ఉ॥ ఆసభయందుఁ బూర్వమటులా కుసుమార్యునకెల్ల వారు న
గ్రాసనమిచ్చి యార్యవణిగన్వయ సద్గురు భాస్కరార్యుహే
మాసనమందునుంచి, యుచితాసనసీమలఁ దాముచేరి మా
వాసవకన్యకంతయు శుభంబగుఁ గావుతమంచుఁ గోరుచున్॥
వ॥ అయ్యెబది గోత్రంబుల రాయబారుల నుచితసత్కారంబులఁ బరితృప్తులంజేసి మనవాసవాంబకు శుభంబెకదయని కొందరును, రాజనరేంద్రుండేమనెనని కొందరును, మీచతురవచన రచనావిశేషమ్మున నమ్మూర్ఖుని చిత్తమ్ము మెత్త

పడెనా యని కొందరును, మన కష్టంబుల కప్పాపాత్ముండొప్పెంగదా యని కొందరును, బలువురు పలువిధమ్ములఁ బ్రశ్నించుచుండ నారాయబారులకు మేటియైన కోటీశ్వరుండు లేచి కరమ్ములుమోడ్చి, రాజసభయందుఁ బ్రవేశించినదాది, యందుండి క్రమ్మరి నిజనివాసమ్ములఁజేరినవరకు జరిగిన వృత్తాంతంబంతయు, వారియంతరంగములనాటఁ బల్కి, దానంజింతాక్రాంతస్వాంతులైన నవైశ్యకులావతంసులకు వెండియు నిట్లనియె—

చ॥ జరిగినదానిగూర్చి విచారపడన్ ఫలమేమిలేదు; భూ
వరునిమనంబుమార్చు టలబ్రహ్మకునైనఁ దరంబుగాదు; ఏ
కరణిని నేదికాఁగలదొ కాక తొలంగదు భావిచింతనన్
జరుపుఁడు మీరిఁకన్ వ్యవధిచాలదు పోలదు సామమీపయిన్॥

శా॥ భూనాథుండు మహోగ్రసేనుఁడయి రేపోనేఁడో మీయూరికిన్
రానున్నాఁడు సమస్తవైశ్యకులవారంబున్ సమూలంబుగా,
దానిర్మూలమొనర్పనెంతయును బంతంబూనినాఁడిత్తరిన్
మానప్రాణములందు మీకు నభిమానంబేదొ చర్చింపుఁడీ!॥

ఉ॥ కంజదళేక్షణన్ జరణకంజయుగమ్మునఁజేర్చి రాజుతో
డం జెలిమిన్ వహించుటో హుటాహుటి నక్కుటిలాత్మ శౌర్యవ
హ్నిం జొరబారుటో త్వరగనెయ్యదికర్జమొ నిర్ణయించి, మీ
రంజలిసేయుఁడయ్య! జగదంబకు మీయిలువేల్పురాణికిన్॥

ఉ॥ తూఁచిరనేకవస్తువితతుల్ తులయందదిగొప్పయౌనె, యీ
నీచశరీరరక్షయొ యనిందితకీర్తి శరీరరక్షయో,
తూఁచుఁడు త్రాసునందునిచి తూచఁగనేర్చిన జాణలార! మీ
ధీచతురత్వమెల్ల జగతింబ్రకటింపుఁడుదారశీలురై॥

ఉ॥ ఇచ్చెదమాత్మజాత నటులీయక తక్కిననెల్లవారమున్
జచ్చెదమన్ ప్రమాణమును జ్ఞప్తికిఁదెచ్చుకొనుండు, రెండిటన్
జెచ్చెరమీకుఁబోలినదిసేయఁగ నియ్యెడనిర్ణయింపుఁడీ
మచ్చుఘటింపఁజేయకుఁడు మానితవైశ్యకులప్రసిద్ధికిన్॥

చ॥ విమలవణిక్కులంబురుపవిత్రతగన్నది తొల్తనుండి ప్రా
ణములకు నాశచెంది భువనస్థితకీర్తినిమాపరాదు, మా



సముగణియించుచున్ బుధులునల్వురితోడనుజావు పెండ్లితో
సమమను టిట్టిదుస్థితులు సంభవమౌనని యెంచియేకదా?

మ॥ జనియించెన్ మనవైశ్యవంశమున వాశర్వాణి జన్మించియున్,
మనకీదుస్థితియేలకల్గెనని యేమాత్రంబుఁ జింతింపకుం
డనుమానింపకుఁడయ్యమారమణి! మిమ్మైక్యంబుగావింపఁగాఁ
దనలోనెంచి ఘటింపఁజేసె విపరీతంబైన యీదుస్థితిన్॥

శా॥ లోకాలోకమహాసుఖానుభవ మాలోకింపఁగా నేర్తు రీ
లోకంబున్ విడనాడిరేని, నెపుడేలోకంబువారేని నా
లోకంబే తమయంతమందుఁగన నాలోచింతు రల్లాటమీ
కాకైలాసగిరిప్రయాణమున కేలాయిట్టి సంకోచముల్॥

శా॥ ఆమూర్ఖక్షితినాథుక్రౌర్యమున కాయర్పింత్రుప్రాణంబు లిం
క్షేమార్గంబును రాజతాద్రిశిఖరం బెక్కంగ లేదొక్కొ? నా
కేమార్గంబున నయ్యుమారమణి తానేతెంచె నీవీటి క
ట్లామార్గంబును బట్టి మీరును జనుండయ్యా! వణిక్సత్తముల్॥

వ॥ అనియిట్లనేకవిధంబులఁ బ్రస్తుతావస్థవ్యక్తపరచుచునుపన్యసించినకోటీశ్వరు నుపన్యాసమ్ము సావకాశమ్ముగనాలించి, సభ్యులెల్లరును దీర్ఘాలోచనాయత్తచిత్తులై నిట్టూర్పులువిడుచుచు నేమాడుటకుందోపకమిన్నకుండుటం దత్సభామందిరంబుసర్వంబు నిశ్శబ్దంబయ్యె. అంతఁగుసుమార్యాది వైశ్యప్రముఖులు కొందఱు భాస్కరునికభిముఖులై సాభిప్రాయంబుగఁ దన్ముఖావలోకనంబొనర్చుచుండ నతండును యోగాసనమునుండికన్నులు విప్పినమహర్షి చందంబునఁ దన దీర్ఘాలోచనమునుండి మేల్కని నిట్టూర్పు నిగిడించి, నిశ్శబ్దంబై యున్నతత్సభాభవనంబెల్లఁగలయంగాంచి, దీనభావంబుఁగదుర మందమంద మృదువాక్కులనెల్లర కిట్లనియె.

క॥ కోటీశ్వరు వచనంబులఁ
దేట పడెంగద నృపాలుతెఱఁగాతఁడిఁకన్,
బాటలగంధికినై యే
చేటైనను సాహసించిచేయున్ మనకున్॥

శా॥ ఏచేటో యననేల యీతఁడనినట్లే సర్వసైన్యంబుతో
నాచండాలుఁడువచ్చి తీరు మనపై కాపైనిఁ గోపోన్నతిన్,
నీచుండెంతటి సాహసంపుఁ బనికేనిన్ సాహసించున్ నిజం,
బేచావైనను దప్పదైనఁ దుదకిట్లీచావు చావచ్చునే?

చ॥ జననముతోడనేకలదు చావును నేడుతొలంగినన్ దొలం
గునె యది రేపు; నేటివరకున్ జగమందతి నిష్కళంక జీ

వన మొనరించి, నీచునకుఁ బ్రాణములర్పణ చేసి, మీకులం
బును నపవిత్రమున్ సలిపిపోయెదరయ్య వివేకహీనులై॥

శా॥ రాజేకాదు ప్రపంచమంతయును సంగ్రామంబుఁ గావించినన్
రాజాస్యన్ విడనాడకుండుట యథార్థంబింక ముమ్మాటికిన్
యోజింపన్ బనిలేదు దీనికయి యత్యుత్సాహసంపన్నులై
మీజన్మంబు తరింపఁజేసికొనుఁడీ మీమీ ప్రయత్నంబులన్॥

వ॥ అని మిన్నకుండ నాడినుండియు రాజపక్షావలంబకులై వాదించు వైశ్యసంఘంబులు తత్సభామధ్యమునుండి లేచి పూర్వోక్త ప్రకారంబు వ్యతిరేకంబుగ వాదింపం గడంగుటయుఁ దత్పక్షంబున కధ్యక్షుండైన లక్ష్మీపతిశ్రేష్ఠి సభ్యుల సంబోధించుచు,

చ॥ కటకట! లోకమందెచటఁ గానని యీవిపరీతబుద్ధి మీ
కెటు జనియించెనయ్య! ధరణీశ్వర సూనునకున్ గుమార్తె ని
చ్చుట తగదంచు నే నిగమసూక్తి వచించునొ చూపుఁడయ్య! సం
కటములు కోరి తెచ్చుకొని కట్ట! త్యజింతురటయ్య ప్రాణముల్!

చ॥ ఔనని యొక్కఁడన్న! నిజమౌనవు నంచును ముందువెన్కలన్
గానక మీరలెల్లరొక కన్యకకై యిటు బల్మిఁ జావఁగా
నౌనె నృపాల పుత్రునకు నాత్మజ నిచ్చి సుఖింపరయ్య! య
మ్మానినియున్ సుఖించు ననమాన నిరంతరభోగ సంపదన్॥

ఉ॥ ఎన్నఁడు లేని ధర్మమని యీసభయందిటు సాహసించి మీ
రెన్నిగ యొమారులంటి రిది యెన్నఁడుఁ గానని ధర్మమానె? మీ
రన్నది మీరె దిద్దుకొనుఁ డా ధృతరాష్ట్రుఁడు గాంచ లేదె? తా
మున్ను యుయుత్సునాముఁడగు పుత్రుని వణిక్కుల కాంతయందు సన్

వ॥ ఇట్టి పురాణ ప్రమాణంబులెన్నేనియుం గలవవి యట్లుండ, బ్రాహ్మణుండు, క్షత్రియవైశ్య శూద్ర కాంతలను, క్షత్రియుండు వైశ్య శూద్ర కాంతలను, వైశ్యుండు శూద్రకాంతను గైకొనందగునని శాస్త్రంబులు వేనోళ్ల ఘోషింపుచుండ, శాస్త్ర గ్రంథ గంధశూన్యులై యధర్మంబధర్మంబని పల్కుచు, మీరెల్లరు నప్పసికూనం గూడి, యేగంగ నెయ్యగ్గి నుఱికిన నుఱికెదరుగాక; మాకియ్యది పోలని కార్యంబగుట నిట్టిదారుణంబున కొడంబడమని త్రికరణ శుద్ధిగ వచించినంతఁ దత్సభామధ్యంబునుండి పంచాస్యంబుకరణిఁ గోటీశ్వరుండు విజృంభించి,

క॥ తెలిసినఁ దెలిసిన వారల
పలెఁ బలుకుఁడు మీకుఁ బలుకవలసిన యెడలన్।
గుల నిందయు గురు నిందయు
నలువఁగఁ దగునయ్య నిందు సభలో నకటా!॥



మ॥ అతి లోభాత్ముఁడు నంధుఁడౌపయి దురాశాయత్తచిత్తుండు నౌ
ధృతరాష్ట్రుండొ ప్రమాణ పూరుషుఁడు వాదింపంగఁ జాల్చాలు మీ
సుతలన్ రేని కొసంగుఁ డట్లయిన మాజోలేల మాకర్మ సం
గతికిన్ మీరు విచారమొందకిటు లేకాలమ్ము వర్ధిల్లరే?॥

చ॥ కృతయుగ ధర్మజాతములు కేవలమున్ గలి కాలమం దస
మ్మతములటంచుఁ బల్కెదరు మాన్యులు కావున మీమతం బస
మ్మతమగు మాకుఁ గూడ నిఁక మావిషయమ్ముఁ దలంపఁ బోక మీ
హితమెటులో యటుల్ జరుపుఁ డిందు వసించిన మీకు హానియా॥

శా॥ తల్లిం దండ్రియు సర్వబంధు జనజాతంబుల్ కుల స్వాములున్
బిల్లన్ రేని కొసంగఁ జాలమనుచున్ భీష్మించి యున్నారలా
ఫుల్లాబ్జానన రాజుమాటయె వినం బోదింతయున్ జూచి, మీ
రల్లోలేక్షణ బల్మి నిమ్మనుట మేలౌనయ్య లక్ష్మీపతీ॥ 

చ॥ రజనికరాస్యతోఁ ద్వరగ రమ్మని యీశ్వరునాజ్ఞయయ్యె నా
రజతగిరి ప్రయాణ మనురక్తినొనర్పఁగ నిష్టమున్న యా
ద్విజవరులెల్ల రండు వెనుదీయక; తక్కినవారు పొండు; ఈ
గజిబిజి యేల? వ్యర్థముగఁ గాలముఁ బుచ్చఁగరాదు మాకిఁకన్॥

గీ॥ అనుచు గంభీరముగఁ బల్కినంతఁ దత్స
భాభవన సీమనుండి నిర్భయము గాఁగ
ధన్యచరితులు కొందరుత్తమ వణిగ్జ
నాగ్రణులు లేచి యచటి సభ్యాళిఁ జూచి॥

ఉ॥ ఇచ్చెద మాత్మజాత నటులీయక తక్కిన నెల్లవారమున్
జచ్చెదమన్ ప్రమాణవచనంబును దప్పక నిర్భయమ్ముగాఁ
జొచ్చెద మగ్నిమధ్యమున సూనృతధర్మము వంశధర్మమున్,
జెచ్చెరఁ గాచువారమిఁకఁ జేయకుఁడయ్య వృథా వివాదముల్॥

ఉ॥ సందియ మొందఁ బోకుఁడెదఁ జారుతరాన్వయ గౌరవార్థమై
వందలు వేలు వైశ్యజన వర్యులు చొచ్చెద రగ్నిలోన నా
యిందునిభాస్య వెంటఁ దమరెల్లరు నీపయిఁ దత్ప్రయత్నముల్
ముందుగఁ జేయుఁడయ్య! పురమున్ నరనాథుఁడు చేరులోపలన్॥

ఉ॥ దుర్మతులున్ వివేక రహితుల్ కుల గౌరవ శూన్యులైన దు
ష్కర్ములతోడ వాదములుఁ జర్చలుఁ జేయఁగ వేళగాదు, త
త్కర్మలఁబట్టి బుద్ధులును గల్గుచు నుండును నట్టివారికిన్
ధర్మవిధోపదేశము వృథాశ్రమగాక ఫలంబుగల్గునే?॥

వ॥ అని యిట్లు నిశ్చితంబుగఁ బలుకఁ గోపాటోపంబున భూపాల పక్షావలంబులైన వైశ్యులార్నూటపదిరెండు గోత్రంబులవారుం గ్రక్కునఁ దత్సభాభవనమ్ము విడచి, యావలకుం జనుటయుఁ జండాగ్నికుండ నిర్మాణప్రయత్నమ్మున కుద్యుక్తులైన తక్కటినూటరెండు గోత్రంబుల మేటి కోమటులంగాంచి, దీనాననుండై కుసుమార్యుండు భాస్కరార్యున కిట్లనియె.

ఉ॥ కార్యము నిశ్చయింపఁబడెఁ గాదె గురూత్తమ! మీయనుజ్ఞచే
నార్యవణిక్కులంపు యశమంతము సేయక నిల్వఁగా వణి
గ్వర్యులు కొందఱిందు సమకట్టిరి; తక్కిన వారుఁగూడ నీ
కార్యము పట్లతోడ్పడినఁ గల్గకయుండును నేవిచారమున్॥

ఉ॥ ఐన విరోధులై వెడలినట్టి వణిక్కులఁగూర్చి దుఃఖమున్
బూనినలాభమేమి? యెటుపోయినఁ బోవఁగనిండువారి; నీ
పై నొనరించు కార్యమెటువంటిదొ దేవరనిర్ణయించినన్
గాని యెఱుంగరాదు మనకాలము వ్యర్థమొనర్పరాదిఁకన్॥

చ॥ అనుటయు భాస్కరార్యుఁడును నందులకెంతయు సంతసించి, యి
ట్లను, గుసుమార్య! నీవనినదంతయు నిక్కము! యీవిధంబునన్
జనిన వణిక్కులాధముల సంతతికిన్ మఱి మీకు నీపయిన్
దనరదు భాంధవంబు పెడదారిని బోదురు మాంసభక్షులై॥

వ॥ ఇదిమదీయ శాపంబిట్లుండుఁగాక, నీవింక సత్వరంబుగ నేగి, యేతదగ్నిప్రవేశోద్యమంబు నగరంబునందంతటం జాటించి, దురాత్ముండగు నరాధినాథుని యాగమనంబు గుర్తించి, యెఱింగింపఁదగు వైశ్యకుమారులం గొందఱఁ బురమ్ముచుట్టును గాపుంచి యీయుద్యమమ్ముల మన కన్యాలలామమ్మున కెఱింగించి, యామె యభిప్రాయమ్మును దెలియందగునని యానతిచ్చి యంతతోఁ దత్సభ ముగియించెనని సూతుండెఱింగించినఁ దదనంతర కథావిధానమ్మును వినఁ గుతూహలంబయ్యెనని శౌనకాదులెంతయుం బ్రార్థించుటయు.

క॥ వాగింద్రియదుష్ప్రాప య। శోగుణ గుణజాల సృష్టసుందరభువనా
వాగింద్రియ గుణవర్ధని। వాగీశ్వరి! యీశ్వరీ! శుభంకరి! జననీ!॥

గద్య

ఇది శ్రీమద్భోగరాజవంశ పయఃపారావార రాకాసుధాకర రామయామాత్యపౌత్ర బాలాప్రసాదతనూభవ! శ్రీవిజయనగర మహారాజాస్థానకవిపదధౌరేయ నారాయణమూర్తినామధేయ ప్రణీతంబైనకన్యకావిజయంబనుమహాప్రబంధంబునందు తృతీయాశ్వాసము



శ్రీ

# కన్యకావిజయము

## చతుర్థాశ్వాసము

క॥ మందార వనవిహారిణి!
వందారు సమస్తభక్తవరదాయిని యా!
నంద స్వరూపిణీ! యిం
దిండిర వేణీ! భవాని! త్రిభువన జననీ!॥

వ॥ తల్లీ! యపధరింపు మట్లు ప్రార్థించిన శౌనకాదులకు సూతుం డిట్లులనియె.

చ॥ గురునియనుజ్ఞ నక్కుసుమకోమటి తక్షణమగ్ని వార్తలన్
బురమునఁ జాటఁబంచి భటముఖ్యుల వైశ్యకుమారవర్యులన్
వరుసగఁ గాపుపెట్టి నలువంకలు భద్రమొనర్చి యంతఁ దా
నరిగె నిజాత్మజాత సముదంచిత కాంచన సౌధసీమకున్॥

మ॥ చనియమ్మందిరమందుఁ గొందఱవశేక్షచంద్రాస్యలంగాంచి, య
వ్వనితామధ్యమునన్ సహస్రశశిబింబస్ఫూర్తి భాసిల్లు కాం
చనగాత్రిన్ నిజపుత్రిఁగాంచి, తనకున్ సైరింపరానంత మీ
ఱిన సంతాపము లోనడంచుకొని చేరెన్ దత్సమీపంబునన్॥

ఉ॥ ఆతనిఁగాంచినంతనె లతాంగులు దిగ్గున లేచి సిగ్గుమై
భీతకురంగుల ట్లచటువీడి తొలంగిరి తోడనే ముఖా
బ్జాతము మందహాసరుచి భాసిలఁ దండ్రికి మ్రొక్కవచ్చెఁ గ
న్యాతిలకమ్ము కంకణ ఘణంఘణ నిక్వాణముల్ సెలంగఁగన్

క॥ మ్రొక్కినఁ గడుమక్కువ నును
జెక్కిళులను ముద్దులాడి చెంతనె రతనాల్

చెక్కిన చొక్కపుఁబీఠం
బక్కడఁగని యధివసించె నక్కన్నియతోన్॥

శా॥ ఆలీలన్ వసియించి, లోనివగ నింతైనన్ వెలింబుచ్చక
బ్బాలారత్నముతోఁ బ్రసంగ మొనరింపం బూనె నాతండ్రి యా
ప్రాలేయాచల కన్యకాంశభవ దివ్యజ్ఞాన పారీణయై
పోలన్ సర్వ మెఱుంగునంచు నెఱుఁగం బోఁ జాలఁడింతేనియున్॥

చ॥ జరుగుచునున్న సంగతులు సర్వమెఱుంగుటె కాకముందుసన్
జరుగఁగనున్న సంగతులు సైతమెఱింగిన తన్ను నాతఁడే
మెఱుఁగని దానిగాఁదలచు టెంచుచు లోనసె నవ్వుకొంచు, నే
మెఱుఁగనియట్లె తండ్రి వచియించునుడుల్ వినుచుండెనచ్చటన్॥

త॥ ముప్పిరిగొను వాత్సల్యము
చిప్పిల నీతులును గథలు చెప్పుచునటఁ దాఁ
జెప్పఁదలంచిన సంగతి
కప్పుడు సందర్భ మొదవ నతఁడనియె నిటుల్॥

చ॥ మరచుచునుంటినమ్మ పలుమారులు నీకొకవింతవార్త నే
నెఱుఁగఁగఁజేయనెంచి, వినుమిప్పుడు జ్ఞప్తికివచ్చెనాకు భూ
వరుఁడలరాణ్మహేంద్ర పురవల్లభుఁడింతకుమున్ను వచ్చి నిన్
బరిణయమాడఁగోరి పలుభంగుల నన్బ్రతిమాలెనేసుమా!॥

మ॥ సరియే చూతమటంచు నప్పటికిఁ దత్సందర్భ యుక్తిన్ నరే
శ్వరునిన్ వీటికిఁబంపి యిందుఁగల వైశ్యశ్రేణిరప్పించి, యె
ల్లరకుం జెప్పితి నీవిశేషమును; భల్భంగుల్ వితర్కించి కొం
దరు నిన్నిమ్మని రమ్మ! కూడదని వాదంబాడి రన్యుల్ గడున్॥

ఉ॥ వారును వీరొనర్చిన వివాదము మాటలకేమి ధర్మ దీ
ప్తారతుఁ డార్యవైశ్య గురుసత్తముఁ డౌమన భాస్కరుండు ని
ర్ధారణ చేసెనియ్యది యధర్మమటంచు నధర్మవృత్తిలోఁ
జేరరటమ్మ వైశ్యకులశేఖరులెన్నఁడు నెవ్వరేనియున్?॥

చ॥ తనయను మీకొసంగుట యధర్మముగాన క్షమించి మాకుమా
ర్తెనుద్యజియించి గౌరవ మతిం దమ కర్పణసేయు కాన్కలన్



గొనుఁడని యా నరాధమునకుం గబురంపితి మాతఁడింతయున్
వినకయె క్రౌర్యవృత్తి తలపెట్టినవాఁడఁట యేమి పాపమో?॥

చ॥ మనపురమున్ సమస్తము నమానుషవృత్తి దహించునంట! యొ
క్కని నయినన్ ద్యజింపక చకాచక వైశ్యుల నెల్లఁ గూల్చుచున్
మనఘన వైశ్యవంశము వినాశ మొనర్చునెయంట! చూచితే
తనయ! దురాత్ముఁ డేకరణి దారుణ కృత్యమొనర్పఁ బూనెనో?॥

ఉ॥ అంతియె కాక యంతకు మరంతటి క్రౌర్యముఁ బూనిన న్మహీ
కాంతునకున్ గుమార్తెనిడఁగాఁ దగదంచును వైశ్యులెల్లఁ గా
సంతయు భీతిచెందక నరాధముచేతను జచ్చుకన్న న
త్యంత మహాగ్నిఁ జొచ్చెద మటంచును దాల్చిరి కంకణమ్ములన్॥

ఉ॥ ఏమియొనర్తు మన్నను నొకింత యుపాయము దోపదమ్మ! ని
న్నా మనుజేశ్వరాధమున కర్పణ చేసి యశమ్ము వాయుటో,
యీమహితార్యవైశ్య కులమెల్ల నశించుట కోర్చుకొంటయో
యేమియొనర్చు టుత్తమమొ యిందు వచింపుము నీకుఁదోచినన్॥

చ। అని కడు యుక్తి యుక్తముగ నాతఁడు పల్కిన నాలకించి, యా
ననమున మందహాస మొకనవ్యవిలాసముఁ గూర్ప ముంగురుల్
తనకొన గోళ్ళదిద్దుచును దండ్రి సమీపముఁ బాసి నీరజా
నన నిలిచెన్ లసన్మణిగణస్థగితంబగు కంబ మూతగాన్॥

క॥ అటునిలిచి కొంతవరకా
కుటిలాలక మొగము వంచుకొని యుండి తనం
తటనిటులనె మధురప్ర
స్ఫుట సువచోరచన కతఁడు చోద్యంబందన్॥

క॥ తగుగతిఁ గార్యాకార్యము
లగుఁ గాదని నిర్ణయించునట్టి సమర్థుల్
మగవారలుగాకీ మా
మగువలకుం గలదె యాసమర్థత తండ్రీ!॥

చ॥ తెలియని దాననైన భవదీయ కుమారిక నోటచేత నేఁ
దెలిసిన దాననై తెలిసితిన్ దెలియందగు నెల్లసంగతుల్,

తెలియని దానిగాఁ దలఁచి తెల్పితి విచ్చటి వార్తలన్నియున్
దెలియుదు ముందు సంగతుల తీరు నెఱుంగుదు దాప నేటికిన్॥

ఉ॥ కన్నె నొసంగుఁడంచు నరకాంతుఁడు పెట్టెడు బాధచేత, మీ
రన్నము నిద్ర లేక నెలవై పడుచుండిన పాట్లెఱింగియే
యున్నను నేమెఱుంగనటులుంటిని నేటిదినంబు దాక నన్
గన్నయనుంగుఁదండ్రి! కొఱగానివిచారము మానుమీపయిన్॥

చ॥ ఎఱుఁగుదు మిమ్ము మూర్ఖధరణీశుఁడు పెట్టెడు బాధలెల్ల నే
నెఱుఁగుదు మీరలెల్ల ననునీయక చేయుప్రయత్నమంతయు
న్నెఱుఁగుదు ముందు కాఁదగిన దేదియొ; యింతకుమున్నె యన్నియ
న్నెఱుఁగుదు కన్నతండ్రి! యిటులింతయు నాకు వచింప నేటికిన్॥

క॥ ఏతండ్రి యింటియందును
గూఁతురునై యెరుఁగ నిట్లకుంఠితసౌఖ్య
వ్రాతమ్మో తండ్రీ! ని
న్నే తండ్రిగ నెంతు నింక నీలోకమునన్॥

ఉ॥ ఈశ్వర భక్తశేఖరుఁడవీవు మహాత్ముఁడ వోయితండ్రి! స
ర్వేశ్వరు నాజ్ఞనీకునుదయించి తరించితి నేనుఁగూడ, వై
శ్వేశ్వర! యింక నైహిక సుఖేచ్ఛలనెల్లఁ ద్యజించి హాయిగా
విశ్వమయున్ హరుం గనఁగ వేగమ యేగుద మెల్లవారమున్॥

క॥ వెనసెన్ని జన్మములకున్
గుసమాంబయె తల్లి తండ్రి కుసుమార్యుం డా
కుసుమాంబకాంతకుఁడు ప్రా
ణసమానుండతఁడె నాకు నాథుఁడు తండ్రీ! ॥

ఉ॥ కేవలమున్ మదాంధుఁడయి క్రిందును మీఁదరయందు ధూర్తధా
త్రీవిభుఁడిట్లు నాకొఱకు రేబవలున్ దపియించుచున్న వాఁ
డేవిధి నెట్టి క్రౌర్యమున కేని దెగింపఁగలాఁడు బల్మిమై
చావఁగనున్న వాఁడు వినఁజాలునె సాధువచోహితార్థమున్॥

చ॥ ఎఱుఁగఁడు వాఁడు నన్నుఁ బరమేశ్వరు కూరిమిదాసిగా వణి
క్తరుణినటంచు నెంచియిటు తా శలభంబు ఫలాశనగ్గిపై



కరుగఁదలంచి నట్లు నను నంటఁదలంచుచునున్న వాఁడు త
ద్ధరణివరాధముండు నిజదారుణ కర్మ నశింపకుండునే?॥

చ॥ మనమున రాజుక్రౌర్యమును మాటికిమాటికి నెంచి భీతిలం
జనదిఁక సత్వరంబుగ యశస్కరు భాస్కరు నాజ్ఞరీతి నీ
దినమ పవిత్రుఁడౌ ననలదేవునియందున నైక్యమౌద మో
జనక! యతండు సాధులకుఁ జల్లనివాఁడు దయాళుఁ డుంజుమీ॥

మ॥ అనలద్వారముఁ జొచ్చి శ్రీరజతశైలాంతర్గుహామందిరం
బున మౌనీంద్రసురౌఘమధ్య, మణిదీప్తుల్ గ్రాలు హేమాసనం
బు నధిష్ఠించి జగంబు లేలు కరుణాంభోరాశి నీశుం గనన్
మనమీనాఁడు ప్రయాణమౌద మమరుల్ మర్త్యుల్ ప్రశంసింపఁగన్॥

మ॥ మన వెంటన్ మన వైశ్యులెల్ల నిజరామారత్నముల్ వెంటరాఁ
జను దేరంగలరింక నొక్కయెడ భాస్వత్కుండ మధ్యంబునం
దనలస్వామిని నిల్పి భూగగన మధ్య వ్యాప్తు నింజేసి యో
జనకా! భూపుని రాకకున్ మును సమస్తమ్మొనర్పన్ వలెన్॥

శా॥ నా వెంటన్ భయదానల ప్రతతిలోనం జొచ్చు వైశ్యాళిఁ దా
నా వైశ్వానరుఁ డాదరాయతకృపాయత్తైక చిత్తంబుతో
రావచ్చున్ ననుఁ జేరవచ్చునని చేరంజేర్చు మేల్బల్లనా
భావం బొప్ప స్వకీలికాకరపరిష్వంగానుషంగంబులన్॥

వ॥ అని మరియుం బెక్కుభంగుల నిజజనకునకు ధైర్య వైరాగ్య సముత్సాహ జనకంబులగు పలుకులు పలుకుచుండ, నంత నాకస్మికంబుగ

చ॥ అనలము సిద్ధమయ్యెఁ గుసుమాంబ కుమార్తెను జేనికీయ కా
జనపతిచేతఁ జచ్చుటయు సమ్మతిలేక మహాగ్నిఁ జొత్తుమం
చనుపమమౌ ప్రతిజ్ఞఁగొనినట్టి వణిక్కుల ముఖ్యులార! యో
యనఘచరిత్రులార! తరియయ్యెఁ బ్రయాణముగండు లెండిఁకన్॥

చ॥ అనియొక జాంఘికుండు పురమంతటఁ జాటుచునుంట గ్రక్కునన్
వినుటయు మోముదమ్మి నొక వింతవికాసము దోఁపఁ దండ్రితో
ననియెఁ గుమార్తె తండ్రి! నిజమారయ నీవును భాస్కరార్యుఁడు
న్ననుపమ దివ్యదృష్టిగలయట్టి మహాత్ములుగాఁ దలంచెదన్॥

క॥ ధర్మాధర్మజ్ఞులు కడు
నిర్మలమానసులు విపుల నీతిజ్ఞులు స
త్కర్మపరుల్ మీరెఱుఁగని
మర్మంబులు లేవు జనక! మానవతిలకా!॥

ఉ॥ చెప్పకయుండరాదనుచుఁ జెప్పితి వంతియెకాని తండ్రి! నే
డిప్పనియందు నాహృదయ మెట్టిదొ యింతకుమున్న పోల్చి నీ
వప్పుడె తత్ప్రయత్నములనన్నియుఁ జేసితి వెల్లభంగులన్
దప్పదు దేవతాంశజనిత ద్విజరత్నమ వాదు వేసుమా॥

చ॥ అలఘుసురాంశ సంభవుఁడవయ్యును నావలనన్ గ్రహింపఁగా
వలసిన సంగతుల్ గలవు వానిని సర్వవణిక్కుమారకా
వళులు వినంగ నగ్నిభగవానుని మ్రోలఁ బ్రశాంతచిత్తనై
తెలిపెద నవ్వి ముఖ్యముగ దేవరహస్యములో ద్విజోత్తమా॥

గీ॥ దేవ దేవపదార్చన దీక్ష చెలులఁ
గూర్చుకొని చిచ్చుకడఁ జేరుకొనెద నేను
తొలుత నీవేగి యవశిష్టములను జక్కఁ
బెట్టుమో తండ్రి శంకలు కట్టిపెట్టి॥

క॥ అని పలికి వాసవాంబిక
జనకుని యనుమతిని గొనుచుఁ జనెఁ దనపనిపైఁ
దనయవచించిన చొప్పున
నొనరింపం గుసుమశ్రేష్ఠియును జనెనంతన్॥

చ॥ అటు పెనుగొండలోని వణిగగ్రణులందరు వాసవాంబతోఁ
జటుల మహాగ్ని మార్గమున శంకరశైలమునందునన్ వసిం
చుట కరుదెంచుచుండిరనుచున్ జగమంతటఁ జాటువాంఛ నం
తట నలిసీధవుం డపరధాత్రిధరాగ్రము నెక్కెఁ గ్రక్కునన్॥

చ॥ అలపెనుగొండయందలి ద్విజాళులెకాకజగాననంతటన్
గల సకలార్యవైశ్యులును నాడుశిఖింబడ వాత్రిగామసీ
మలనెలకొల్పుకుండముల మండెడు భూగగనాంతరస్ఫుట
జ్వాలనము కాంతులోయనఁగ సాంధ్యరుచుల్ విలసిల్లెనెల్లెడన్॥



సీ॥ ఆసమయమున నార్యవణిక్కుమారులె
ల్లరును సాయంసంధ్యలనునొనర్చి!
పరమేశ్వరుని జాల భక్తితోఁ బూజించి
సకలవాంఛలయందు సన్యసించి
నిటలవక్షోభుజా తటములందుఁ బ్రభూత
మగు బూదిపూతల నమరఁదీర్చి!
లలితరుద్రాక్షమాలలును జొక్కపుఁబూల
దండలు నురములనిండఁ దాల్చి!

గీ॥ భక్తలోకేశయీశ! మాంపాహియనుచుఁ
గన్యకాపరమేశ్వరీ కావుమనుచు
నగరమధ్యస్థితాగ్నికుండంబుదరికిఁ
బరుగులిడఁ జొచ్చి రానందభరితులగుచు॥

క॥ వచ్చిన సకలద్విజతతి
నచ్చటఁ గని యగ్నిదేవుఁ డాహ్వానింపం
జొచ్చెననఁ జిచ్చుకీలల్
జెచ్చెర నభిముఖముగా జ్వాలింపఁ దొడంగెన్॥

ఉ॥ హైమవతీ సమాంశభవ యాద్విజకన్యక వాసవాంబ యా
పై మహనీయులైన ద్విజవంశజులున్ హరభక్తశేఖరుల్;
ఈమెయిఁ దచ్ఛరీరముల నేనుస్పృశించి పవిత్రుఁడౌదు ని
భ్భామినటంచు నంబరముముట్టఁ దొడంగెను నగ్గివేల్పటన్॥

చ॥ మనకడకేగుదెంచిన యుమాపరమేశుల రాయబారి తా
మన కల రాజతాచలము మార్గముఁ జూపెడు మార్గదర్శి యీ
ఘనునిట గౌరవింపవలెఁ గాయని చారుసుగంధ పుష్పచం
దనములఁ బూజసల్పిరిముదంబున వైశ్యులు వీతిహోత్రునిన్॥

ఉ॥ ఆవిధిఁ బూజసేసి వణిగగ్రణులెల్ల నిమీలితాక్షులై
కేవల తన్మయత్వమునఁ గేశవమిత్రు సుమాకళత్రునిన్
భావమునందునిల్పి దృఢభక్తి భజించుచునుండ నంతనా
నావిధ చారుమంగళనినాదము లొక్క మొగిన్ వినంబడెన్॥

చ॥ వినఁబడినంతఁ గన్నులను విప్పిదిశల్ గనుచుండఁ దత్పురాం
గనలు మహాపవిత్రలు జగన్నుతశీలలు వేనవేలుగాఁ
దనుగొలువంగ నానడుమఁ దారకలన్ శశిబింబమట్టులన్
దనరెడు కన్య నాసుగుణధన్యను గాంచిరి వాసవాంగనన్॥

మ॥ తమసర్వాభరణాంబరమ్ములు వణిక్త్స్రీమణుల్ దాల్చిసం
భ్రమమేపారఁగఁ గుంకుమమ్ము పసుపున్ రాజిల్లు తాంబాళముల్
తమహస్తంబుల నూని మంజులజయారావమ్ములన్ దివ్యగా
నములన్ వాసవకన్యవెంటఁబడి రానా డెల్లరొక్కుమ్మడిన్॥

సీ॥ చెక్కుటద్దాలపైఁ జొక్కంపు రతనాల
తాటంకముల తళత్తళ లెసంగ,
తలయంటు కతననెంతయు రేగి ముంగురుల్
నిండుచందురు మోమునిండఁగ్రమ్మ
పసుపు పచ్చని జరీ పట్టుపుట్టము ఛాయ
తనువు బంగరు కాంతినినుమడింప
మందార సుమహార మకరంద ధారాగ
తేఁదిందిరము లటు నిటుఁ జెలంగ
చిన్ననవ్వులు నవ్వుచుఁ జెలులతోడ
ముచ్చటించుచు నానంద మూర్తి వోలె
దివ్యతేజంబుతో బయల్దేరి వచ్చె
భాసురగుణావలంబ శ్రీవాసవాంబ॥

సీ॥ నేలఁజీరాడు నన్నెలత పెన్నెఱివేణి
కొనలెత్తి కొందఱంగనలు నడువ
లలిత మంగళ గీతములతోడఁ గపురంపు
హారతులను గొందఱతివ లొసఁగ
ముఖచంద్ర మండలమ్మునఁ గ్రమ్ముముంగురుల్
చెలులు కొందఱుదిద్దిచక్కఁ జేయ
నేలనంటగనీక నిద్దంపు మడుగుల
నడుగులకుం గొందఱబల లొత్త
చామరంబులు కొందఱు సఖులు వీవ।
సతులు కొందఱు పన్నీరు జల్లుచుండ।
నాకకాంతలతో నందనమున కేగు।
శచి విధమ్మున వచ్చె నచ్చటికి నెలఁత॥



వ॥ అట్లుఖండవైభవమ్మున వచ్చిన యవ్వాసవాంబనరసి, వైశ్యులెల్లరు బ్రహ్మానంద భరితులై కావించిన జయజయారావంబులును, స్తోత్రనినాదంబులును మంగళ స్వనమ్ములును మిన్నందుచుండ, నయ్యాలిసీలాలక యనిమేషభావంబున వారలసంభ్రమోత్సాహంబులు పరికించి, సంతసించి, వారిజన్మంబులు ధన్యంబులు గావింపనెంచి, యవ్వైశ్యలోకంబెల్లఁగలయసీక్షించి, గంభీరవాక్యంబుల. నిట్లనియె.

ఉ॥ ధన్యులు ధన్యులో ద్విజవతంసములార! సమస్తలోక స
న్మాన్యు లుమామహేశ్వరులు మానసమందున మీయనూన సౌ
జన్యత ధర్మతత్పరత చాలఁగ మెచ్చిరి మీతపంబులున్
బుణ్యములున్ ఫలించె యశముం గడియించిరి శాశ్వతోన్నతిన్॥

శా॥ అంతశ్శత్రుల నార్వురన్ గెలిచి యత్యంత ప్రభంగన్న ధీ
మంతుల్ మీరలు మీకు నల్పుఁడును సామాన్యుండునౌ శత్రుభూ
కాంతుండొక్కఁడు నేమికీడు సలుపంగాఁజాలు వాఁడీవృథా
భ్రాంతింజెందెడుగాక; యిందుఁగల మర్మం బెల్ల రాలింపుఁడీ!॥

సీ॥ కైలాసముననుండు ఖలుఁడుగంధర్వుండు
చిత్రసేనాఖ్య దుశ్శీలుఁడొకఁడు,
మీకులంబందు జన్మించినకన్యను
రమణీయసౌందర్యరాశియైన
దేవకియనుదాని, దావరించి, కుమార్తె
నిండంచు మిము వేడ నిందువదన
నాదురాత్మునకు నీరైరి మీరును నంత
నానీచుఁడమిత్రాగ్రహము వహించి,
గీ॥ మర్త్యలోకానఁబుట్టి కుమార్తెతోడ
నొకట మీరెల్లరగ్నిలో నురుకుఁడనుచు,

శాపమీయంగ నీవును జగతియందుఁ
బోడమెదవటంచుఁ బ్రతిశాపమిడిరిమీరు॥

వ॥ ఇట్టి మీమీశాపప్రతిశాప కారణంబున యింతయుసంభవించె. కామాధుండగు నాగంధర్వాధముండె విష్ణువర్ధనుండయ్యెనని యెరింగించి వెండియు నిట్లనియె:

చ॥ పరమరహస్యమింకొకటి పల్కెదనో ద్విజవర్యులార! మున్
సురథుడు నాన్నృపుండును యశోనిధియైన సమాధినా వణి
గ్వరుఁడును నిర్వ్యరుంగలిసి కాన నుమాసతిఁగూర్చి యెంతయున్
స్థిరతరభక్తితోఁదపము సేయఁగ నా నగరాట్కుమారియున్॥

చ॥ కరుణమెయిం బ్రసన్నయయి కాంక్షితముల్ వచియింపుఁడన్న భూ
వరుఁడల నాకలోకపు నివాసముఁ గోరెను వైశ్యుఁడో యుమా
తరుణి! కుమార్తెవై కడుముదంబున నాకుజనింపుమమ్మ! నా
వరమిదియేయనంగ శివవల్లభ చిర్నవులుల్లసిల్లఁగన్॥

గీ॥ సురపురావాస సుఖములా సురథికొసఁగి,
కూతురయ్యెదనని వైశ్యుకోర్కెదీర్చి,
యంబికాదేవి నిజనివాసంబుఁజేరె,
సురథుడు సమాధియు బ్రమోదభరితులైరి॥

వ॥ అట్లుకటాక్షించిన యప్పరమేశ్వరి వరప్రభావంబున నాసమాధియను వైశ్యుఁడె నేడు కుసుమార్యుండయ్యె అయ్యంబికాదేవియే వాసవాంబయై తద్గర్భంబునం జనియించెఁ గనుంగొనుండని పల్కుచు.

సీ॥ నలుదెసల్ భాసిల్లునవరత్న ఘటితకాం
చనకిరీట ప్రభాచయముతోడ,
ధనురాకృతిని ఫాలమునఁ గ్రాలు మేలుసిం
దూరరేఖాత్రయ ద్యుతులతోడ,
కంఠసీమను వ్రేలు ఘనమణిస్థగితహా
రాద్యనేక విభూషణాళితోడ,
అవయవంబుల దివ్యధవళకాంతులమనో
హరమైన నందివాహనముతోడ,



పాపములఁ బాపు చల్లని చూపుతోడఁ
చంద్రికలఁ జల్లు మందహాసంబుతోడఁ
బరమ కల్యాణి శ్రీపురహరుని రాణి,
యంబికాదేవి ప్రత్యక్షమయ్యె నపుడు॥

గీ॥ తోడనే మింట దేవ దుందుభులు మ్రోసె,
సురలు పూవుల వానలఁ గురిసిరంత,
భక్తి పరవశులై ద్విజ ప్రముఖులెల్లఁ
జలనములు లేక ప్రతిమలై నిలచి రపుడు॥

గీ॥ భయము నుత్సాహ మమిత సంభ్రమము నొంది.
దేవదేవి సాక్షాత్కార దివ్య తేజ
మరసి యరయంగ లేక యయ్యార్య,
రత్నములుకనుల్ మూసి కరమ్ము లెత్తి॥

సీ॥ ధన్యులమైతి మోతల్లి! యాశ్రిత కల్ప
వల్లి! నీదివ్య రూపంబు గాంచి,
మాతపమ్ము ఫలించె మాకులమ్ము తరించె,
మాభాగ్య మసమాన మోభవాని,
దేవతలైన నీదివ్య తేజంబును
దేరిచూడఁగ లేరు దీనులైన
నీకుమారకుల మన్నించి కుమారికా
కారమ్ము నెప్పటి కరణిఁ దాల్చి,
యగ్ని మార్గమ్మునన్ రజతాద్రి పైకి
వెంటఁగొనిపొమ్ము మమ్ము నీవిభుని కడకు
జనని! కాత్యాయని! భవాని! శంభురాణి!
భాసుర గుణావలంబ! శ్రీవాసవాంబ!॥

గీ॥ అనుచుఁ బ్రార్థించి కొంత సేపునకుఁ గనులు
విచ్చినంతనె యవ్వైశ్య వితతి కెల్లఁ
బార్వతీ దేవి పూర్వ రూపంబుతోడఁ
గన్యయై కానవచ్చె నక్కజముగాఁగ॥

వ॥ అట్టు లెప్పటి యాకారమ్ముఁ దాల్చి యవ్వాసవాంబ మహానంద పరవశులై యున్న యావైశ్యుల నెల్ల సంబోధించి క్రమ్మఱఁదనపూర్వోపన్యాసంబునకుం గడంగె.

ఉ॥ ఎంతయు శత్రుభావమున నీగతిఁ గారియ వెట్టినట్టి దు
స్స్వాంతుని విష్ణువర్ధనుని సౌఖ్యముగాఁ ద్యజియింతు నంచు మీ
రింతయు నెన్నఁ బోకుఁ డిపుడే నిట నగ్నిని జొచ్చినంత భూ
కాంతుఁడు సైతమున్ శిరము గ్రక్కున వ్రక్కలుగా గతించెడున్॥

ఉ॥ చక్కఁదనంబు వావివరుసల్ గన నీదు, ధనంబుచేతఁ గై
పెక్కినవాఁడు రాజు గణియింపఁగఁ జాలునె మంచిచెడ్డలన్?
జక్కఁదనమ్ముచేతఁ బలుసంకటముల్ ఘటియిల్లెఁ గావునన్
జక్కనికన్య లీకులమునం జనియింపరు గాక యీపయిన్॥

వ॥ ఇయ్యదిమదీయశాపంబని గంభీరముగఁబల్కి యప్పరమేశ్వరి ప్రత్యేకంబుగ వైశ్య కుమారులనెల్లర నుద్దేశించి యిట్లనియె.

ఉ॥ తల్లులతోడ మీయనుఁగుఁ దండ్రులతోడ పితాళితోడ మీ
రెల్లరుఁగూడ నగ్నిఁ బడనెంచిరి. కాని తదీయ యత్నముల్
మెల్లఁగఁ బాసి మీకులము మేదినిపైఁ జిరకాలమిట్లు భా
సిల్లఁగఁజేసి, మీరు చిరజీవులరై సుఖియింపుఁ డెల్లరున్.॥

ఉ॥ పావనమైనయట్టి ద్విజవంశ మనామకమై నశించు మీ
రీవిధిఁ బ్రాణముల్ విడిచిరేని, కులోద్ధరణార్థమై మహా
దేవుఁడు మీరలెల్ల జగతీస్థలినిల్వ ననుజ్ఞ సేసె, మీ
రావిధి నాచరించి చనుఁ డంతమునం దల రాజతాద్రికిన్॥

సీ॥ పరధనకాంక్షయుఁ బరకామినీవాంఛ
కలనైనఁ దలఁపక మెలఁగుఁడయ్య
కష్టమ్ములెన్ని సంఘటనమైనను నోర్చి
వైశ్యధర్మము నిల్పవలయునయ్య
స్వమతక్రమాగత సకలకర్మ సమాచ
రణదీక్షల నుపేక్షఁ గొనకుఁడయ్య
భాస్వద్యశోధుర్య భాస్కరాచార్యు నే
విషయమందును మీరు విడకుఁడయ్య



హాసమునకైనను నసత్యమాడకుండ
జీవహింసను నెన్నఁడుఁ జేయకుండఁ
గాటకవ్యాధి భయములుగలుగకుండ
నెల్లకాలమ్ము మీరు వర్ధిల్లుఁడయ్య.

వ॥ ఇది యిట్లుండ నింతకుం బ్రధానంబగు నొండువిషయంబు వినుండని వెండియు నిట్లనియె.

క॥ మానుగఁ బూర్వమునుండియు
మేనరికపుఁ బెండ్లిసేత మీ కాచారం
బై నెగడుచునున్నది, యది
మానఁగ రాదెన్నఁడున్ గుమారకులారా!

ఉ॥ నవ్యయశస్కరంబగు సనాతన ధర్మము మానుటెంతయున్
భావ్యముగాదు కార్యములపట్ల త్యజింపకుఁడయ్యదీని మాం
డవ్యమహామునీశ్వరుఁ డొనర్చిన శాసనమిద్ది దీనినో
భవ్యమనస్కులార! యనపాయత నెప్పుడొనర్చుచుండుఁడీ!

గీ॥ కుంటియును గూనియును మఱిగ్రుడ్డియునిటు
లెన్నివంకలు చేకూరెనేనియును వి
వాహములు నిశ్చయము చేయుపట్టునందు
మేనమామల బిడ్డలమానరాదు॥

ఉ॥ చక్కనివాఁడుకాఁడనియొ చక్కనికన్యక కాదటంచునో
యొక్కపుడేని మేనరిక మొల్లకతప్పిచరించిరేని, పెం
పెక్కదు తత్కులంబు సుఖియింపకపోదురు నవ్వధూవరుల్
నిక్కముధర్మభంగమును నిందయుఁగల్గును మీకుధాత్రిలోన్॥

వ॥ అని పలువిధంబులధర్మకర్మాచరణ విధానంబు లనేకంబులు బోధించుచుండ నాకస్మికంబుగఁ గొందరుచారులు బిరబిర నయ్యెడ కరుదెంచి, వచ్చె వచ్చె విష్ణువర్ధనుండు తన క్రౌర్యమును వెల్లడింప నగరంబు సొచ్చెనని బిగ్గరగ నుగ్గడింప నచ్చటి వైశ్యజాతంబెల్లఁ దుల్లిపడి యిటునటుం జూచుటయు నక్కన్యకాదేవి నిజోత్క్షిప్తకర సంజ్ఞల వారల కలవరపాటు తొలంగించి పాపాత్ముండగు భూపాధమునికంటఁ గ

మ్మఱంబడక సత్వరంబుగ నావెనువెంటనే తెండని యానతిచ్చి నిమీలిత నేత్రయై ముకుళిత కరకమలయై

శా॥ కైలాసంబుననుండి నాకొఱకు నాకాంతుండు నిన్నంప, ది
క్పాలోత్తంసమ నన్నుఁ దోడుకొని పోవన్ వచ్చినావీవు; నా
పాలన్ దైవమవోయి యింకఁ గృపతో భద్రమ్ముగా నన్ను మా
కైలాసంబునఁ జేర్చునీవు యశమున్ గైకొమ్ము వైశ్వానరా॥

వ॥ అని కడు భక్తిధ్యానించి,

సీ॥ ముఖచంద్రమండలమ్మున నుండి నవువెన్నె
లలకాంతి గగనమండలము నిండ
కర్ణతాటంకసంఘటిత రత్నద్యుతుల్
గడు వేడ్క సాంధ్యరాగంబు గాయ
నేలజీరాడు పెన్నెఱివేణి దిక్కులఁ
గటిక చీకటులను గ్రమ్ముచుండ
శిఖితాపమున మేనఁ జెలువొందు ఘర్మాంబు
కణములు చుక్కల కరణి మెరయ
పరమకల్యాణి శర్వాణి భ్రమరవేణి
సైకతశ్రోణి శ్రీమహాశంభురాణి
వదన జితశశిబింబ శ్రీవాసవాంబ
మహిత భయదాగ్నిలోఁ జొచ్చి మాయమయ్యె॥

చ॥ ఉఱికినయంతనే యొకరి నొక్కరు చూడక యొక్కమారుగా
నుఱికిరి వైశ్యులెల్ల భయదోజ్జ్వలితానలకుండమందు నం
బరమున నిల్చి వేలుపులు బాపురె మేలు శబాసటంచున
ప్పరమవణిక్కులోత్తములఁ బ్రస్తుతి చేయుచుఁ దక్షణంబునన్॥

చ॥ ఎదురుగ వచ్చి యాద్విజకులేశ్వరులం గడు గౌరవించుచున్
త్రిదశులు వారినందరిని దివ్యవిమానములందుఁ జేర్చి స
మ్మదమున దేవతానగరమార్గమునం జని దేవలోక సం
పదల సుఖింపఁ జేసి కొనివచ్చిరి పిమ్మట రాజతాద్రికిన్॥



ఉ॥ వాసవకన్యకాకృతిని బాసి భవాని మహేశుతోడఁ గై
లాసమునన్ యథావిధి మెలంగుచునుండఁగ వైశ్యులెల్ల రు
ల్లాసముతో నుమాశిఖిలలాటులఁ గొల్చుచు వాసమున్న వా
రా సరసీజ బాంధవ మృగాంకముగా రజతాచలంబునన్॥

వ॥ ఇచ్చటఁ బెనుగొండ యందు విష్ణువర్ధనుఁడు క్రూరాయుధ పాణులగు సైనికులతో వైశ్యుల నెల్లఁ జిత్రవధ గావింప నత్యాగ్రహంబునఁ బ్రవేశించి, కన్యకాదేవి శాపప్రకారమ్మ తదగ్నిప్రవేశ కాలమ్మున శిరము పగిలి గతించుటయు, వైశ్యకుమారులెల్లరు మహానందచేతస్కులై కన్యకాంబిక యుపదేశించిన ధర్మకర్మంబుల నాచరించుచుఁ; గుసుమార్యుని స్థానంబున విరూపాక్షుని నగరాధినాథునిగా నియమించుకొని, యంబికాదేవి యనుగ్రహంబున క్షామచోరరోగాకాల మరణ భయంబులు లేకుండ సకల సంపత్పరిపూర్ణులై వంశవర్ధనులై చిరకాలమ్ము సుఖించి, యంత్యంబునఁ గైలాసంబునకుం జనిరని సూతుండు శౌనకాదులకెఱింగింపఁ దత్కథావిధానంబున కమ్మహర్షులెల్లరుం గడు హర్షస్వాంతులై యాతని నెంతయుం గొనియాడిరి.

క॥ హిమవన్నగరాడ్జాతా!
విమలగుణోపేత! విబుధవినుత సుచరితా
యమరేశ్వర మకుటాగ్ర
స్థమణివిరాజిత పదాంబుజాతా! మాతా॥

గద్య.

ఇది శ్రీమద్భోగరాజవంశపయఃపారావార రాకాసుధాకర రామయామాత్య పౌత్ర బాలాప్రసాదరాయ తనూభవ శ్రీ విజయనగరమహారాజాస్థాన కవిపద ధౌరేయ నారాయణమూర్తి నామధేయ ప్రణీతంబైన కన్యకావిజయంబను మహాప్రబంధంబునందు సర్వంబు సంపూర్ణము.

ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః



# చిత్రకషాయ.

20 సం॥ నుండి పేరుపొందిన కుటుంబౌషధము. లోపలకు పైకి కూడ నుపయోగింపవచ్చును. ప్రయాణస్థులకు ప్రాణమిత్రము. పిల్లలకుసంజీవి. విద్యార్థులకు కన్నతల్లి. ఏజబ్బునకైనను ఎప్పుడైనను పిలిచిన పలికెడువైద్యునికంటె ఎక్కువయుపయోగము. ఎట్టిగొడబలేదు. అనుపానము మంచినీళ్లుమాత్రమే. కంపుండదు. నోటికి హితవుగానుండును. గర్భిణీస్త్రీలుకూడా ఉపయోగించవచ్చును. కలరా ప్లేగు వగైరా కఠినవ్యాధులుకూడ నివ్మదించును. తేలు పాము ఎలుక వీటికాట్లనుకూడా నివ్మదింపజేయును.

సీసా 1 కి రు. 0-14-0 మాత్రమే
పోస్టుఖర్చులువేరు.

అవధూత మెడికల్ హాల్
విజయనగరం

